బమ్మెర పోతనామాత్య ప్రణీతంబగు



# రుక్మిణీకల్యాణము

(టీకా తాత్పర్య సహితము)

పండిత పరిశోధితము.







పబ్లిషర్సు:

వేంకట్రామ అండ్ కో.,

బెజవాడ - మద్రాసు.

1940




కాలికో 0—8—0.

పేపరు 0—6—0,

# పీఠిక.

పూర్వము మన పురాణములు, కావ్యములు, నిఘంటువులు మొదలగు గ్రంథములు మూలములతో మాత్రమే యుండుటచే వానిని పండితులు (చదువుకొనినవారు) మాత్రమే సర్వజనులకుఁ దెలియునట్లు చెప్పుట, శిష్యులకు బోధించుట జరుగుచు వచ్చినది. అట్లు శిష్య పరంపరగా లోకమున వెల్లడియగుచుండెను. క్రమముగాఁ బండితులు తగ్గుచుండుటచేత, బుద్ధిమంతులును, జ్ఞాపకశక్తిగల శిష్యులు తక్కువ యగుచుండుటచేతను అర్థతాత్పర్యములతో గ్రంథములు వెలువడ వలసివచ్చెను. అట్టియెడ ముద్రణాయంత్రములు, వర్తక సంఘములును, అన్యభాషాదేశములలో నుండుటచే నచ్చటి పండితులే వ్యాఖ్యానములు సేయుట తటస్థించినది. వారు ఉత్తరదేశముల యందలి యాంధ్రులు. వారు "పోఱఁడు, పిల్లవాఁడు" అను శబ్దములను, పోరఁడు = కలహింపఁడు అను నర్థముగా భ్రమపడుచుందురు. ఇప్పటి పాఠశాలలలోని యుపాధ్యాయులుకూడ "యోగ్యతను మీఱె" అనగా యోగ్యతయం దతిశయించెననుటకు మాఱు, యోగ్యతలోఁగూడఁ దమరేయని బాలకుల కర్థము చెప్పుట తటస్థించుచున్నది. కాలము ననుసరించి యర్థముల వ్రాయవలసివచ్చినపుడు సర్వజనసులభముగా నర్థములు వ్రాయవలయును. అర్థములను వ్రాయుచు వ్యాఖ్యాతలు = టిప్పణము వ్రాయువారు (అనగా అర్థము వ్రాయువారనుట) మధ్యమధ్యను సందర్భానుసారముగా నర్థము చేసుకొందురని చూచుచున్, ఉండన్, జూచుచున్ = చూచుచును అనియు, "ఉండన్" ఉండెను అనియు వ్యతిరేకార్థములు వచ్చుచోట నర్థము వ్రాయకుండ విడువరాదు. మందగమనంబున = తిన్ననినడకతో అనియు, మందగమనంబున ననుటకుఁ దిన్ననినడకతో నను దూరభావమును దెలుపు నర్థము వ్రాయుటకన్న మెల్లనగునడకతో నని వ్రాయుట మంచిదని నాతలంపు. మఱియు నందఱికి విశ్రుతముగా లోకమున

వాడుకలోనున్న పురాణపురుషులను గూర్చి బాలురకుఁ దెలుపు తలంపున వ్రాయుటకన్న వాడుకలో లేని గాథలు తెలియని పురాణ పురుషుల చరిత్రములను విపులముచేసి తెలుపుట వ్యాఖ్యాతల పనియై యున్నది. ఇంకను రూపభేదము, అర్థభేదముగల శబ్దములను బాలుర కలవాటుపడునట్లు చూపుచుండవలెను. ఒక శబ్దముయొక్క యర్థమును పిల్లవానికిఁ దెలుపునపుడు మఱియొకటి రెండు పర్యాయశబ్దము లా శబ్దముతోపాటు బోధపడు చుండవలెను. ఎట్లనగా:-సాయకము = బాణము (అమ్ము), కార్ముకము = ధనుస్సు (విల్లు), అవి ఇట్లు శబ్దార్థములు బోధపడుటకే మహాకవులు తమ గ్రంథములలో వాడిన పేరును వాడక యలంకార రూపమున నొక్క యర్థముగల పర్యాయ శబ్దములను వాడుచు వచ్చిరి.

ఈ విషయములన్నియు నాతలంపున నుత్తమములుగాఁ దోఁచి నాశక్తివంచన లేక యీ రుక్మిణీ కల్యాణమునకు టీకాతాత్పర్యములను వ్రాసియుంటిని. ఈ దారి సర్వజనసమ్మతము కాఁగలదనియే నా తలంపు. గుణగ్రహణ పారీణుల యాదరమునకుఁ బాత్రుఁడనగుదును గాకయని భగవంతుని ప్రార్థించుచుంటిని.

ఇట్లు సజ్జనవిధేయుఁడు

**కొత్తపల్లి సుందరరామయ్య.**



శ్రీ గోపాలకృష్ణ పరబ్రహ్మణేనమః.

# రుక్మిణీ కల్యాణము.

## టీకాతాత్పర్యసహితము.

---



కంఠచాపఖండన
పాకారిప్రముఖవినుత • భండన విలస
త్కాకుత్స్థవంశమండన
రాకేందుయశోవిశాల • రామనృపాలా. 1

టీ. శ్రీకంఠ=కంఠమున విషముగల యీశ్వరునియొక్క, చాప= ధనుస్సును (వింటిని), ఖండన=విఱుగఁగొట్టినవాఁడా! పాకారి=పాకుఁడను పేరుగల రాక్షసునకు విరోధియైనయింద్రుఁడు, ప్రముఖ=మున్నగువారిచే, వినుత = కొనియాడఁబడిన, భండన = సంగరము కలవాఁడా (యుద్ధముగలవాఁడా యనుట). విలసత్ = ఒప్పుచున్న, కాకుత్స్థ = కకుత్స్థునియొక్క, వంశ=కులమునకు,మండన=అలంకారమైనవాఁడా! రాకా+ఇందు = రాకేందు = పున్నమచంద్రునిబోలు, యశః = కీర్తిచేత, విశాల = అతిశయమును గాంచినవాఁడా! రామనృపాలా = రాముఁడను పేరుగలరాజా !

తా. శివుని వింటిని ముక్కలుచేసినవాఁడును, ఇంద్రుఁడు మొదలగు దేవతలచేఁ గొనియాడఁబడిన యుద్ధములుచేసినవాఁడును, కకుత్స్థ

కులంబునకు అలంకారమైన వాఁడును, ఎక్కువకీర్తిచే నొప్పువాఁడునగు శ్రీరామమూర్తి !

అవ. శ్రీరామమూర్తి నుద్దేశించి గ్రంథమును రచించిన పోతన్న చమత్కారముతోఁ గూడిన శుభమును గావించి, కథను వినవలయునని మొదలు పెట్టుచున్నాఁడు.

క. ఆ వనజగర్భు పంపున
రైవతుఁ డను రాజు దెచ్చి ♦ రామున కిచ్చెన్
రేవతి యనియెడు కన్యను
భూవర మును వింటి కాదె ♦ బుద్ధిం దెలియన్. 2

టీ. భూవర=భూభర్తా! (రాజా), ఆ=ప్రసిద్ధుఁడైన, వనజగర్భు పంపునన్=బ్రహ్మయొక్క యాజ్ఞచేఁ, రైవతుఁడు అనురాజు=రైవతుఁడను పేరుగల యావర్తకదేశపురాజు, రేవతియనియెడు = రేవతి యను పేరునఁ బిలువఁబడు, కన్యను=చిన్నదానిని, తెచ్చి = తీసుకొనివచ్చి, రామునకున్=బలరామునకు, ఇచ్చెన్=ఒసఁగెను. (ఈవృత్తాంతమును) మును=మున్ను, బుద్ధిన్=మనస్సునందు. తెలియన్=విశదమగునట్లు,వింటి కాదె=వినియుంటివికదా (అనఁగా నీవు వింటివనుట).

తా. బ్రహ్మదేవుని యాజ్ఞచే రైవతుఁడను రాజు తన కుమార్తె రేవతియను పేరుగల చిన్నదానిని తీసికొనివచ్చి బలరామునకొసంగి పెండ్లిచేసిన సమాచారమును మున్ను వింటివికదా! పరీక్షిన్మహారాజా!

అవ. శ్రీ శుకులవారు భాగవతగాథను పరీక్షిత్తునకుఁ జెప్పుచు బలరామకృష్ణుల దిగ్విజయము, జరాసంధుఁడు సైన్యసమేతుఁడై వారిని జయింపం జని వారెక్కిన ప్రవర్షణపర్వతంబును దగులబెట్టుట, బలరామకృష్ణులు ఆ మంటనుండి తప్పించుకొని ద్వారకానగరమున కరుగుట మొదలయిన కథనుజెప్పి రుక్మిణీకల్యాణకథనుజెప్ప నుపక్రమించి తొల్లిఁటిగాథ ఎటింగినదే యని చెప్పుచున్నాఁడు.

వ. తదనంతరంబ. 3

టీ. తత్ + అనంతరంబ = తదనంతరంబ = అట్లు జరిగినతర్వాత,

తా. రేవతిని బలరాముఁడు పెండ్లియాడిన వెనుక.

మ. ఖగనాథుం డమరేంద్రుఁ గెల్చి సుధమున్ ♦ గైకొన్న చందంబునన్ । జగతీనాథులఁ జైద్యపక్షచరులన్ ♦ సాళ్వాదులం గెల్చి భ।ద్రగుఁడై చక్రివరించె భీష్మకసుతన్ ♦ రాజీవగంధిన్ రమా।భగవత్యంశభవన్ మహాగుణమణిన్ ♦ బాలామణిన్ రుక్మిణిన్. 4

టీ. భీష్మకసుతన్ = భీష్మరాజు కుమార్తెను, రాజీవగంధిన్ = పద్మముల సువాసనవంటి శరీరపరిమళముగలదానిని, రమాభగవతీ = శ్రీదేవియొక్క, అంశ = అంశముచే, భవన్ = జన్మించిన దానిని (అనఁగా లక్ష్మీదేవి యవతారమైనదనుట), మహత్ = ఘనమైన, గుణమణిన్ = మణులవంటి గుణములు గలిగినదానిని, బాలామణిన్ = బాలికలలో రత్నమువంటి దానిని, రుక్మిణిన్ = రుక్మిణియను బాలికను, మున్ = పూర్వము, ఖగనాథుండు = పక్షిఱేఁడు ♦ (గరుత్మంతుఁడు), అమరేంద్రున్ = దేవేంద్రుని, గెల్చి = ఓడించి, సుధన్ = అమృతమును,

---

మహాగుణమణిన్, అనునట్లు "బాలామణిన్" అనఁగా రత్నమువంటి బాలికను అని కొందఱు అర్థమును వ్రాసిరి. ఇక్కడ మణికి శ్రేష్ఠార్థమే చెప్పవలయునుగాని రత్నమువంటిబాలికయని చెప్పుట సమంజసముకాదు. రత్నము, మణి, వతంసము=ఇవి శ్రేష్ఠవాచకములు.

♦ గరుత్మంతుఁడు తనతల్లియైన వినత దాసీత్వమును బాపుటకు ఇంద్రునోడించి యమృతముం గొని తెచ్చినట్లు భారతమునఁ జెప్పఁబడియున్నది.

ఇంద్రుని గెల్చి యమృతముఁదెచ్చిన గరుత్మంతునితో సాళ్వాదులం గెల్చి రుక్మిణిం దెచ్చిన శ్రీమహావిష్ణువును బోల్చుట యొకగొప్పలోనిదికాదు గాని, విష్ణుసంబంధమున గరుత్మంతుని యాధిక్యతఁ బొగడఁదగినదియగును.

గైకొన్న=తీసికొనివచ్చిన, చందంబునన్=విధముగా, చైద్య=చేదిదేశపు రాజగు శిశుపాలుని, పక్ష=వైపున, చరులన్ = తిరుగుచుండువారిని, సాళ్వాదులన్ = సాళ్వ + ఆదులన్ =. సాళ్వుఁడు మొదలైన, జగతీ నాథులన్=పుడమి ఱేండ్లను (రాజులను), గెల్చి=జయించి, చక్రి=శ్రీ కృష్ణుఁడు,భద్రగుఁడై=మంగళమును గాంచినవాఁడై,వరించెన్=కోరెను.

తా. పూర్వము గరుత్మంతుఁడు దేవేంద్రు నోడించి యమృత మునుగొన్న చందమున శిశుపాలుని యిష్టులగు రాజులం జయించి కుండిన పురాధీశ్వరుండగు భీష్మకుని కుమార్తెయగు రుక్మిణిని శ్రీకృష్ణుండు వరించెను.

వ. అనిన రాజిట్లనియె మున్ను రాక్షసవివాహంబున
స్వయంవరంబునకు వచ్చిన హరి రుక్మిణింగొనిపోయెనని
పలికితివి. కృష్ణుం డొక్కరుం డెవ్విధంబున సాళ్వాదుల
జయించి తనపురంబునకు జనియె నదియునుంగాక. 5

టీ. అనినన్=ఇట్లుశుకుండు చెప్పఁగా, రాజు=పరీక్షిన్మహారాజు, ఇట్లు అనియెన్=ఈప్రకారము చెప్పెను, మున్ను=వెనుక, స్వయం వరంబునకున్=కన్యక తనకుఁదాను వరునిగోరుకొను పెండ్లికి, వచ్చిన= ఏతెంచిన, హరి=కృష్ణుఁడు, రాక్షసవివాహంబునన్=బలిమిని బాలిక నెత్తుకొనిపోయి పెండ్లియాడుటకు, రుక్మిణిన్=రుక్మిణీదేవిని, కొని పోయెన్+అని = కొనిపోయెనని (తీసికొనివెళ్ళెనని), పలికితివి = చెప్పితివి, కృష్ణుఁడు, ఒక్కరుండు=సహాయములేనివాఁడై, ఎవ్విధంబు నన్=ఎట్లు, సాళ్వాదులన్=సాళ్వ+ఆదులన్=సాళ్వుఁడుమున్నుగాగల వారిని, జయించి=ఓడించి, తనపురంబునకున్ = తనయొక్క పట్టణము నకు (ద్వారకకు), చనియెన్ = వెళ్ళెను, అదియునుంగాక = ఇంత మాత్రమే కాక (ఇంకనుముందు కొంతకలదనిభావము.)

శా. కల్యాణాత్మకమైన విష్ణుకథలా♦కర్ణించుచున్ ముక్తుఁడౌ
కల్యుండెవ్వఁడుతృప్తుఁడౌనవివినం♦గాఁగ్రొత్తలౌచుండు

సా. కల్యుం డేర్పడ భూసురోత్తమ యెఱుం ♦ గం బల్కవే
రుక్మిణీ, కల్యాణంబు వినంగ నాకుమదిలోఁ ♦ గౌతూహ
లం బయ్యెడిన్. 6

టీ. భూసురోత్తమ (భూసుర + ఉత్తమ) = మంచి బ్రాహ్మణుఁడగు శుకుఁడా! రుక్మిణీకల్యాణంబు = రుక్మిణి వివాహచరిత్రము, వినంగన్ = వినుటకు, నాకున్ = నాకు, మదిలోన్ = మనస్సునందు, కౌతూహలంబు = ఇచ్ఛ, అయ్యెడిన్ = కలుగుచున్నది. (కావున) కల్యాణ + ఆత్మకమైన = మంగళరూపముగల, విష్ణుకథలు = విష్ణువు యొక్క గాథలు, ఆకర్ణించుచున్ = ఆలించుచు, ముక్తుఁడు + ఔ + కల్యుండు = ముక్తినిగాంచు పుణ్యాత్ముఁడు, తృప్తుఁడు = తనివి నొందినవాఁడు, ఎవ్వఁడు + ఔన్ = ఎవ్వఁడును గాడు, అవి = ఆకథలు, వినంగాన్ = వినుటకు, క్రొత్తలు = నూతనమైనవి, అవుచున్ = అగుచు, ఉండున్ = ఉండును, సాకల్యంబు = సర్వమును, ఏర్పడన్ = విశదమగునట్లు, ఎఱుంగన్ = తెలియునీతి, పల్కవే = పల్కుమా.

తా. శుకుఁడా! విష్ణుకథలు విని తృప్తినొందువారుండరు గావున నాకును మరల విన వేడుక యగుచున్నది. కావున రుక్మిణీకల్యాణకథను జెప్పుము.

క. భూషణములు సెవులకు బుధ
తోషణము లనేక జన్మ ♦ దురితౌఘ విని
శ్శోషణములు మంగళతర
ఘోషణములు గరుడగమను ♦ గుణభాషణముల్. 7

టీ. గరుడగమను = గరుత్మంతుఁడు వాహనముగాఁగల విష్ణుమూర్తియొక్క, గుణభాషణముల్ = గుణములను వచించుటలు, చెవులకు = కర్ణములకు, భూషణములు = అలంకారములు, బుధ = విద్వాం

"ముక్తుఁడౌకల్యుండు" అనుటకు "ముక్తివైకల్యుఁడు" అని పాఠాంతరము కలదు. వికంతత్వమును విడిచినవాఁడని యర్థము.

సులను, తోషణములు = ఆనందము నిచ్చునవి, అనేక = వివిధములను, జన్మ=జన్మములయందలి, దురితౌఘ (దురిత+ఓఘ) = పాపసముదాయములను, వినిశ్శోషణములు = మిగుల శుష్కింపఁజేయునవి (నాశనము జేయునవి), మంగళతర= శుభాధిక్యతను, ఘోషణములు = చాటునవి.

తా. విష్ణుకథలు చెవులకు అలంకారమైనవియు, విద్వాంసుల నానందింపఁజేయునవియు, పాపములం బారదోలునవియునై ఒప్పుచున్నవి.

వ. అని రాజడిగిన శుకుండిట్లనియె. 8

టీ. అని = ఇట్లు, రాజు = పరీక్షిత్తు, అడిగిన = అడుగఁగా, శుకుండు= శుకమహర్షి, ఇట్లనియె(ఇట్లు+అనియె) = ఇట్లుగాఁబలికెను.

చ. వినుమువిదర్భదేశమున ♦ వీరుఁడు కుండినభర్త భీష్మకుం
డనునొక దొడ్డరాజు గల ♦ డాతని కేవురుపుత్రులగ్రజుం
*డనఘుఁడు రుక్మినాఁబరగు♦ నందఱకుంగడగొట్టుచెల్లెలై
మనుజవరేణ్య! పుట్టెనొక♦మానినిరుక్మిణినాఁ బ్రసిద్ధయై. 9

టీ. మనుజవరేణ్య = మానవోత్తముఁడవగు పరీక్షిన్మహారాజా ! వినుము= ఆలకించుము, విదర్భదేశమునన్, వీరుఁడు= బలముకలవాఁడు, కుండినభర్త=కుండిన పట్టణమునకు ఏలికయు, భీష్మకుండు, అనన్= అనునట్టి, ఒక దొడ్డరాజు= ఒక మహారాజు, కలడు = ఉన్నాఁడు, అతనికిన్=ఆరాజునకు, ఏవురు = ఐదుగురు, పుత్రులు = సుతులు, (ఉండి)

* కృష్ణద్వేషియైన రుక్మిని అనఘుఁడని పిలుచుట కడువిపరీతమనియు కృష్ణసంబంధముచేఁ బవిత్రుఁడనవచ్చుననియుఁ గొందరభిప్రాయపడుచున్నారు, "అనఘుఁడు రుక్మినాఁబరగు" ననుటకన్న "అనయుఁడు రుక్మినాఁబరగు" ననుట సమంజసమనియు నిదియే కవిహృదయమనియు "యు" అనుటకు "ఘు" అని పడుట లేఖక ప్రమాదమనియు నాయభిప్రాయము. మఱియు నీకవియే, 19 వ పద్యమున నీరుక్మికి "దుస్సంధుఁడు" అను విశేషణమును వాఁడియున్నాఁడు. దుస్సంధుఁడనఁగాఁ జెడుప్రతిజ్ఞ కలవాఁడని యర్థము. కావున అనయుఁడనియే కవిసమ్మతము.

అగ్రజుండు=పెద్దవాఁడు, అనఘుఁడు=పాపములేనివాఁడు రుక్మినాన్ = రుక్మియను పేరుతో, పరగున్ = ఒప్పును (అనఁగా గలఁడనిభావము), అందఱకున్ = ఆ యయిదుగురు సోదరులకును, కడగొట్టు చెల్లెలు=చివరి తోఁబుట్టువు, ఐ=అయి; ఒకమానిని=ఒక చిన్నది, రుక్మిణినాన్=రుక్మిణి యను నామమున, సుప్రసిద్ధయై = ప్రసిద్ధురాలై, పుట్టెన్=జన్మించెను.

తా. కుండిన నగరాధీశ్వరుండగుభీష్మకునికి నయిదుగురుకుమారులును, అందఱికిఁ జిన్నదగు రుక్మిణియను నొక కుమార్తెయుఁబుట్టిరి.

క. బాలేందు రేఖ దోఁచిన
లాలిత యగు నపరదిక్కు ♦ లాగున ధరణీ
పాలుని గేహము మెఱసెను
బాలిక జన్మించి యెదుగ ♦ భాసురమగుచున్. 10

టీ. బాలిక=రుక్మిణియనుచిన్నది, జన్మించి = జననమంది, ఎదుగన్ = వృద్ధిపొందుచుండఁగా, ధరణీపాలుని = ధాత్రీపాలకుఁడయిన భీష్మకుని, గేహము = గృహము, బాలేందురేఖ (బాల+ఇందు రేఖ) = బాలచంద్రకళ, తోఁచిన=చూపట్టఁగా, లాలితయగు (లాలిత+అగు) = పొగడఁదగినదైన, అపరదిక్కు లాగునన్ = పశ్చిమదిశఁబోలె, భాసురము=ప్రకాశముకలది, అగుచున్=అగుచు, మెఱసెన్=తేజరిల్లెను.

తా. రుక్మిణి జన్మించి వృద్ధిబొందుచుండ, భీష్మకరాజుగృహము బాలచంద్రునితోఁ గూడిన పడమటివైపువలెఁ దేజరిల్లెను. (ఉపమాలంకారము.)

వ. మఱియు దిన దిన ప్రవర్ధమానయై. 11

టీ. మఱియు=ఇంకను, దిన దిన=ప్రతిదినమును, ప్రవర్ధమానయై (ప్రవర్ధమాన+ఐ) = పెరుగుచున్నదై.

సీ. పేర్వేర బొమ్మల ♦ పెండ్లిండ్లు సేయుచు
నబలలతోడ వి ♦ య్యంబులందు

గుజ్జెనగూళ్ళను ♦ గొమరొప్ప వండించి
చెలులకుఁ బెట్టించుఁ ♦ జెలువు మెఱయ
రమణీయమందిరా ♦ రామ దేశంబుల
బువ్వుఁదీఁగెలకును ♦ బ్రోదిసేయు
సదమలమణిమయ ♦ సౌధభాగంబుల
లీలతో భర్మడో ♦ లికల నూఁగు

తే. గీ. బాలికలతోడఁ జెలరేగి ♦ బంతులాడు
శారికాకీరపంక్తికిఁ ♦ జదువు సెప్పు
బర్హిసంఘములకు మురి ♦ పములు గఱపు
మద మరాళంబులకుఁ జూపు ♦ మందగతులు. 12

టీ. వేర్వేరన్=వేఱు వేఱు నామములతో, బొమ్మలపెండ్లిండ్లు=బొమ్మలను పెట్టుకొనిచేయు వివాహములు, సేయుచున్=ఒనరించుచు, అబలలతోడన్=బాలికలగు స్త్రీలతో, వియ్యంబులు = పెండ్లిసంబంధములు, అందున్=పొందును (ఆఁడుపెండ్లివారు మీరనియు, మగ పెండ్లివారము మేమనియు నను సంబంధములు). గుజ్జెనగూళ్ళను = ఆటలుగా వండుకొనునోగిరములను(అన్నములను)కొమరొప్పన్,కొమరు+ఒప్పన్=అందగించునట్లు, వండించి=పచనము చేయించి, చెలులకున్ = తోడిపిల్లలకు, చెలువు=ఒప్పిదము, మెఱయన్ = ప్రకాశించురీతిని. పెట్టించున్=తినుటకై యిప్పించును, రమణీయ=మనోహరములగు, మందిర=

"ప్రోదిసేయు" అనుటకు "ప్రోదిపెట్టు" అను పాఠాంతరము కలదు. ఈరెంటిలో ప్రోదిపెట్టు అని యుండుటయే సరసమనియు నదియే కవి సమ్మతమనియు నాతలంపు. ప్రోది=నీరుపాఱు పిల్లకాలువ, బొమ్మల పెండ్లిండ్లుచేయుట, గుజ్జనగూళ్ళను వండుట, పువ్వుతీగెలకు కాలువలు సేయుట, ఉయ్యెలలూగుట బాలికాలక్షణములు.

గృహములయొక్క, ఆరామ=ఉద్యానవనములయొక్క, దేశంబులన్ = స్థలములయందు, పువ్వుఁదీఁగెలకును=పుష్పలతలకును, ప్రోది=సంరక్షణమును, చేయున్=ఒనరించును, సత్=ప్రసిద్ధములును, అమల = నిర్మలములును, మణిమయ=రత్నములతోఁ గూడిన, సౌధ = ఉప్పరిగలయొక్క (మేడలయొక్క), భాగంబులన్=స్థలములయందు, లీలతోన్=విలాసముతో, భర్మ = బంగారపు, డోలికలన్ = ఉయ్యేలలయందు, ఊఁగున్=తూఁగును, బాలికలతోడన్ = చెలికత్తెలతో, చెలరేఁగి = అతిశయించి (ఎక్కువగా), బంతులు=కందుకములు, ఆడున్=క్రీడించును (చెండ్లనాడుననుట), శారికా=గోరువంకలయొక్కయు, కీర=చిలుకలయొక్కయు, పంక్తికిన్=సమూహమునకు, చదువుచెప్పున్=మాటలు, పాటలు, పద్యములు మొదలైనవి నేర్పును, బర్హిసంఘములకున్ = నెమిళ్ళసమూహమునకు, మురిపములు = ఒయ్యారములు, కఱపున్ = నేర్పును, మద=మత్తిల్లిన, మరాళంబులకున్= అంచలకు, మందగతులు= నెమ్మది నడకలు, చూపున్=అగపఱచును.

తా. బొమ్మల పెండ్లిండ్లు సేయుచు, గుజ్జనగూళ్ళను వండించుచు మేడలలో నిండ్లలో నుద్యానవనంబుల విలాసంబుగ విహరించుచు, బంతులాడుచు, గోరువంకలకు, జిలుకలకు మాటలు, నెమిళ్ళకాటలు, హంసలకు నడకలయందలి నీటులుం జెప్పుచు రుక్మిణి యొప్పుచుండును.

వ. అంత. 13.

టీ. ఇట్లుండగా.

సీ. దేవకీసుతుకోర్కి ♦ తీఁగెలు వీడంగ
వెలఁదికి మైదీఁగె ♦ వీడఁదోడఁగెఁ
గమలనాభుని చిత్త ♦ కమలంబు వికసింపఁ
గాంతి నింతికి ముఖ ♦ కమల మొప్పె
మధువిరోధికి లోన ♦ మదనాగ్ని బొడసూపఁ
బొలఁతికిఁ జనుదోయి ♦ పొడవు సూపె

శౌరికి ధైర్యంబు ♦ సన్నమై డాయంగ
జలజాక్షి మధ్యంబు ♦ సన్నమయ్యె
ఆ. వె. హరికిఁ బ్రేమబంధ ♦ మధికంబుగాఁ గేశ
బంధ మధిక మగుచు ♦ బాల కమరెఁ
బద్మనయనువలనఁ ♦ బ్రమదంబు నిండార
నెలఁత యౌవనమున ♦ నిండియుండె. 14

టీ. దేవకీసుతు=దేవకి కుమారుఁడైన కృష్ణునియొక్క, కోర్కి=కోరికలనెడు, తీఁగెలు=లతలు, వీడంగన్=విప్పారఁగా, వెలఁదికిన్=రుక్మిణియను చిన్నదానికి, మైతీఁగె=లతవంటి దేహము, వీడఁదొడఁగెన్=పెంపొందసాఁగెను, కమలనాభుని=శ్రీకృష్ణునియొక్క, చిత్తకమలంబు=హృదయపద్మము, వికసింపన్=విడుచుచుండఁగా, (విప్పారుచుండ), కాంతిన్=వెలుఁగుచేత, ఇంతికిన్=రుక్మిణియను బాలికకు, ముఖకమలము=ముఖపద్మము, ఒప్పెన్=విలసిల్లెను, మధు విరోధికిన్ = మధువను పేరుగల దైత్యునకు విరోధియైన కృష్ణునికి, లోనన్=మనస్సునందు, మదనాగ్ని (మదన+అగ్ని)=మన్మథపరితాపము, పొడచూపన్=కాన్పించుచుండఁగా, పొలఁతికి = రుక్మిణీసుందరికి, చనుదోయి = స్తనద్వయము, పొడచూపెన్ = అగపడెను, శౌరికిన్ = కృష్ణునకు, ధైర్యంబు=ధీరత్వము (గట్టితనము), సన్నమై (సన్నము+ఐ)=స్వల్పమై, డాయంగన్=దగ్గఱకాఁగా (చేరువకాఁగా), జలజాక్షి(జలజ+అక్షి)=పద్మములవంటి నేత్రములు గల రుక్మిణియొక్క, మధ్యంబు = నడుము, సన్నమయ్యెను (సన్నము+అయ్యెన్)సన్నగిలెను, హరికిన్=శ్రీకృష్ణునికి, ప్రేమ=అనురాగముయొక్క, బంధంబు=కట్టుపాటు, అధికంబుగాన్=విస్తారమగుచుండఁగా, బాలకు=రుక్మిణియను చిన్నదానికి, కేశబంధంబు=శిరోజముల ముడి (కొప్పు), అధికము=విస్తారము, అగుచున్=అగుచు, అమరెన్=ఒప్పెను, పద్మనయనువలనన్=కమలలోచనుఁడగు శ్రీకృష్ణునియందు, ప్రమదంబు=ఆనందము, నిండారన్=ఎక్కువకాఁగా, నెలఁత=

రుక్మిణి, యౌవనమునన్ = తగినవయస్సుచేత, నిండి ఉండెన్ = పూర్ణమై యుండెను.

తా. కృష్ణునికోరికతోపాటు రుక్మిణిదేహము వృద్ధి నొందెను. కృష్ణుని సంతోషముతోపాటు రుక్మిణి ముఖవికాస మతిశయించెను. కృష్ణుని యనురాగముతోపాటు రుక్మిణి చనుదోయి స్ఫుటమయ్యెను. కృష్ణునిధైర్యముతోపాటు రుక్మిణి నడుము స్వల్పమయ్యెను. కృష్ణుని ప్రేమవృథపడినట్లు రుక్మిణి తలవెండ్రుకలు పెద్దముడిగా నయ్యెను. కృష్ణుని సంతోషముతో పాటు రుక్మిణి యౌవనము వృద్ధిబొందెను. (అతిశయోక్త్యలంకారము).

వ. ఇట్లు రుక్మి, రుక్మధర, రుక్మబాహు, రుక్మకేశ, రుక్మనేత్రు లను నేవురకుం జెలియలైన రుక్మిణీదేవి తన యెల ప్రాయంబున. 15

టీ. ఇట్లు= ఈవిధముగా రుక్మి, రుక్మధర, రుక్మబాహు, రుక్మకేశ, రుక్మనేత్రులు, అను నేవురకున్ (అను+ఏవురకున్) = అను నామములుగల యైదుగురికి, చెలియలు = తోఁబుట్టువు, అయిన = అయినట్టి, రుక్మిణి, తన = తనయొక్క, ఎలప్రాయంబునన్ = జవ్వనమునందు.

క. తనతండ్రి గేహమునకుం
జనుదెంచుచు నున్న యతిథి ♦ జనులవలనఁ గృ
ష్ణుని రూప బల గుణాదులు
విని కృష్ణుఁడు తనకుఁ దగిన ♦ విభుఁడని తలచెన్. 16

టీ. తనతండ్రి = తనతండ్రిగారియొక్క, గేహమునకున్ = నివాసమునకు (ఇంటికి), చనుదెంచుచున్న = ఏతెంచుచున్న, అతిథి జనులవలనన్ = అభ్యాగతులగు మనుజులవలన, కృష్ణుని = కృష్ణుని యొక్క, రూప = సౌందర్యము, బల = శౌర్యము, గుణ = గుణము, ఆదులు= మున్నగువానిని, విని = ఆలకించి, కృష్ణుఁడు, తనకు, తగిన = తగినట్టి (ఒప్పునట్టి), విభుఁడుఅని = భర్తయని, తలఁచెన్ = ఆలోచించెను. (రుక్మిణి యని భావము.)

తా. తనతండ్రిగారి యింటికిఁ బ్రతిదినము వచ్చుచున్న అతిథులవలన శ్రీకృష్ణుని బలపరాక్రమాదుల విని రుక్మిణి యాతఁడు తనకుఁ దగిన మగండని భావించెను.

క. ఆ లలన రూపు బుద్ధియు
శీలము లక్షణము గుణముఁ ♦ జింతించి తగన్
బాలారత్నముఁ దన కి
ల్లాలుగఁ జేకొందు ననుచు ♦ హరియుం దలఁచెన్. 17

టీ. హరియున్ = కృష్ణుండును, ఆలలన = ఆ రుక్మిణియొక్క, రూపున్ = విలాససంపదయు, బుద్ధియు, శీలమున్ = మంచి స్వభావమును, లక్షణమును = మంచి చిహ్నమును, గుణమున్ = మంచి గుణమును, తగన్ = తగునట్లు, చింతించి = ఆలోచించి, బాలారత్నము = బాలికలలో రత్నమువంటి రుక్మిణిని, తనకు = కృష్ణుఁడయిన తనకు, ఇల్లాలుగన్ = భార్యగా, చేకొందున్ = పరిగ్రహింతును (పెండ్లియాడుదును), అనుచు = అని, తలఁచెన్ = ఊహించెను.

తా. రుక్మిణి సౌందర్యమును గుణమును విని శ్రీకృష్ణుం డామెను పెండ్లి చేసికొన నాలోచించెను.

18

వ. అంత

టీ. తరువాత

ఉ. బంధువులెల్లఁ గృష్ణునకు♦బాలిక నిచ్చెదమంచు శేముషీ
సింధువులై విచారములు ♦ సేయఁగ వారల నడ్డపెట్టి దు
స్సంధుఁడు రుక్మి కృష్ణునెడఁ♦జాల విరోధముఁ జేసిమత్తపు
ష్పంధయ వేణినిత్తు*శిశు♦ పాలునకంచుఁదలంచెనంధుడై.

టీ. దుస్సంధుఁడు=చెడుప్రతిజ్ఞ కలిగిన, రుక్మి=రుక్మియను పేరుగల పెద్దవాఁడు, బంధువులు = తన చుట్టములు, ఎల్లన్ = అందఱును, బాలికన్=రుక్మిణీబాలికను, కృష్ణునకున్, ఇచ్చెదము=ఇచ్చి వివాహము

సేయుదము, అంచు, శేముషీ=బుద్ధికి, సింధువై=సముద్రుఁడై (మంచి బుద్ధిగలవాఁడై), విచారములు=ఆలోచనలు, చేయఁగన్=ఒనరింపఁగా, వారలన్=ఆ చుట్టములను, అడ్డపెట్టి = అడ్డముతగిలి, కృష్ణునెడన్ = శ్రీకృష్ణుని సంబంధమున, చాలవిరోధము = ఎక్కువవైరమును, చేసి, మత్త=మదించిన, పుష్పంధయ = తుమ్మెదలంబోలిన, వేణిన్=నల్లనగు జడగల రుక్మిణిని, శిశుపాలునకు=శిశుపాలుఁడను చేదిదేశపు రాజునకు, ఇత్తున్ = నాచెల్లెలి నొసంగెదను, అంచు=అనుచు, అంధుఁడై=గ్రుడ్డివాఁడై (అనగాఁ గన్నుగానని మదాంధతచే ననుట), తలఁచెన్ = తలంచెను.

తా. రుక్మిణిని కృష్ణున కీయవలెనని బంధువులెల్లరుఁ దలంచుచుండ దుర్మార్గుఁడగు రుక్మి శిశుపాలున కీయనుద్దేశించెను.

ఉ. అన్నతలంపుఁ దానెఱిఁగి ♦ యన్నవనీరజగంధిలోన నా
పన్నతనొందియాప్తుఁడగు♦బ్రాహ్మణునొక్కనిజీరిగర్వసం

---

♦ శిశుపాలుఁడు = చేదిదేశపురాజు; దమఘోషునకు, వసుదేవుని చెలియ లయిన శ్రుతశ్రవసువలనఁ బుట్టిన కొడుకు, వీడు చతుర్భుజ లలాట నేత్రములతోఁ బుట్టినతోడనే రాసభస్వరముతో నేడ్చుచుండఁగాఁ దల్లిదండ్రులు భయమును విస్మయముగలవారై యేమియుఁ దోఁచక యుండిరి. అప్పు డాకాశవాణి ఎవ్వఁడు ఎత్తుకొనునపుడు వీని లలాట నేత్రమును, రెండు సేతులును అడఁగిపోవునో వాఁడు వీనిం జంపును కనుక మీరు ఇందులకు విచారపడక నెమ్మది నుండుఁడని పలికెను. అంతట వీనితలిదండ్రులు తమ్ముఁ జూడవచ్చినవారినెల్ల ఎత్తుకొన నిచ్చుచుండిరి. ఒకప్పుడు బలరామ కృష్ణులు తమ మేనత్తను చూడరాఁగా వారిచేతికి ఇచ్చి ఎత్తుకొమ్మనిరి. అప్పుడు కృష్ణుడెత్తుకొనగానే వీని నొసటికన్నును రెండు చేతులును అడఁగిపోయెను. అంతట వారు ఆశ్చర్యపడి తమకొడుకును నూఱునేరములు చేయునంతవఱకు మన్నించునట్లు శ్రీకృష్ణుని ప్రార్థించి వరముఁ బడసిరి. పిమ్మట

ఛన్నుఁడు రుక్మి నేఁడు ననుఁ ♦ జైద్యునకిచ్చెద నంచు
నున్నవాఁ, డెన్నివిధంబులంజని బు ♦ ధేశ్వర * చక్రికి
విన్నవింపవే. 20

టీ. ఆ నవనీరజగంధి=అప్పుడే వికసించిన పద్మముల వాసనవంటి దేహపరిమళముగలరుక్మిణి, అన్న=అన్నయైన రుక్మియొక్క, తలంపు=ఊహను, తాను, ఎఱిఁగి=తెలిసికొని, లోనన్=తన మనస్సునందు, ఆపన్నతన్ = విపత్తును, ఒంది=పొంది, ఆప్తుఁడు=తన కిష్టుఁడు, అగుబ్రాహ్మణున్ = అయినవిప్రుని, ఒక్కనిన్, చీరి = పిలిపించి, బుధేశ్వర = ఓగొప్ప పండితుఁడా! గర్వ=గర్వముచే, సంఛన్నుఁడు=మిక్కిలి కప్పఁబడిన వాఁడు, రుక్మి, నేఁడు, ననున్, చైద్యునకున్ = చేదిదేశపు రాజగు శిశుపాలునకు, ఇచ్చెదన్+అంచు = ఒసఁగెదనని, ఉన్నవాఁడు = ప్రయత్నించుచుండె, ఎన్నివిధంబులన్=ఎన్ని తెఱఁగులచేనైన, చని = (నీవు కృష్ణునియొద్దకు) పోయి, చక్రికిన్ = చక్రధారియగు కృష్ణునికి, విన్నవింపవే = చెప్పుమా!

తా. తన యన్న రుక్మి తలంపెఱింగి రుక్మిణి తనకు మిక్కిలి యిష్టుఁడయిన బ్రాహ్మణోత్తముం బిలిచి యీ విషయమును కృష్ణునికిఁ దెల్పుమని కోరెను.

క. అయ్యా కొడుకు విచారము
లయ్యయు వారింపఁ జాలఁ ♦ డటు కాకుండన్

---

బహుకాలమునకు ధర్మరాజు రాజసూయయాగము చేయుచుండఁగా అచ్చటికివచ్చి కృష్ణుని పలుఁదెఱఁగుల నిందించి యతనిచేతనే మృతి నొందెను.

---

* చక్రియని వాడుట మిక్కిలి చక్కఁగానున్నది. దీనిచే శిశుపాలుని కుత్తుకను శ్రీకృష్ణుఁడు చక్రముచేఁ దునుముటను సూచించును.

నెయ్యం బెఱిఁగించి చీరుము
చయ్యన నిజసేవకాను • సారిన్ శౌరిన్. 21

టీ. అయ్యా-బ్రాహ్మణుఁడా! కొడుకు విచారములు=పుత్రుని తలంపులు, అయ్యయున్ = మాతండ్రియైన భీష్మకుఁడును, వారింపన్= వ్యతిరేకము సేయను, చాలఁడు=తగినవాఁడుకాఁడు, అటుగాకుండన్= ఆపని యట్లుకాకుండ, నెయ్యము = మైత్రి (అనగా దనకుం గృష్ణుని యందుఁ గల యనురాగమనుట), ఎఱిగించి = తెలిపి, నిజసేవక + అనుసారిన్=తన సేవకుల ననుసరించునట్టి (అనగా భక్త రక్షకుడనుట), శౌరిన్ = కృష్ణుని, చయ్యనన్ = వేగముగా, చీరుము = పిలువుము (తోడితెమ్ము).

తా. పుత్రుని మాటను మా జనకుండును అతిక్రమింప జాలఁడు. కాఁబట్టి నా యనురాగమును కృష్ణునికెఱిఁగించి వేగముగఁ దోడ్కొని రావలయును.

వ. అని కొన్ని రహస్యంబులు సెప్పిన విని బ్రాహ్మణుండు ద్వారకానగరంబునకుంజని ప్రతిహారులవలనఁ దన రాక ఎఱింగించి య న్నగధరుం డున్న నగరుఁ బ్రవేశించి యందు గనకాసనాసీనుండయి యున్న పురుషోత్తముం గాంచి పెండ్లికొడుకవు గమ్మని దీవించిన మునిమునినగవులు నగుచు బ్రహ్మణ్యదేవుఁడైన హరితనగద్దియుదిగ్గన డిగ్గి బ్రాహ్మణుం గూర్చుండ నియోగించితనకు దేవతలు సేయు చందంబున బూజలు సేసి సరసపదార్థసంపన్నంబైన యన్నంబుబెట్టించి రెట్టించిన ప్రియంబున నయంబున భాసురుండైన భూసురుంజేరి లోకరక్షణ ప్రశస్తంబయిన హస్తంబున నతని యడుగులు వుడుకుచు మెల్లన నతని కిట్లనియె.

టీ. అని, కొన్నిరహస్యవచనంబులు=రహస్యపు పలుకులు, చెప్పి నన్=చెప్పఁగా, విని = ఆలకించి, బ్రాహ్మణుఁడు, ద్వారకానగరంబు నకున్=కృష్ణునిపురమునకు, చని=వెళ్ళి, ప్రతిహారులవలనన్=గుమ్మమున గాపుండువారిచే, తనరాకన్ = తనయాగమనమును (వచ్చుటను),ఎఱిం గించి = విన్నవించి,ఆ+నగధరుండు=ఆపర్వతమునుధరించినకృష్ణుఁడు, ఉన్నసగరున్=ఉన్నసౌధమును (మేడను), ప్రవేశించి=చేరి, అందున్= ఆమేడలో, కనక+ఆసన+ఆసీనుండై = బంగారుపీటపై కూర్చుండిన వాఁడై, ఉన్న=ఉండిన, పురుషోత్తమున్ = పురుషులలో ప్రసిద్ధుఁడైన కృష్ణుని, కాంచి = కని, పెండ్లికొడుకవు, కమ్మ, అని, దీవించినన్ = ఆశీర్వాదముచేయఁగా, ముసిముసినగవులు = చిరునవ్వులు, నగుచు = నవ్వుకొనుచు,బ్రహ్మణ్యదేవుండు+ఐన=విప్రులకిష్టదేవుఁడయిన, హరి= శ్రీకృష్ణుఁడు, తనగద్దియన్ = తనసింహాసనమును, దిగ్గనన్ = తటాలున, డిగ్గి=దిగి, బ్రాహ్మణున్=బ్రాహ్మణుని, కూర్చుండన్ = ఉపవిష్టుఁ డగునట్లు, నియోగించి=ఏర్పాటుచేసి, తనకున్=తనకు,దేవతలుచేయు= దేవతలు చేయునట్టి, చందంబునన్=పోలికగా, పూజలుచేసి=పూజించి, సరస=రుచ్యములగు, పదార్థ=వస్తువులచే, సంపన్నంబై = నిండునట్టిది, ఐన=అయినట్టి, అన్నంబు=ప్రసాదమును, పెట్టించి = తినుటకొసంగి, రెట్టించిన=ఇనుమడించిన, ప్రియంబునన్ = దయచేత, నయంబునన్ = మృదుత్వముచేత, భాసురుండు=వెలుఁగొందువాఁడు, ఐన, భూసురున్= ద్విజుని, చేరి=దగ్గరకుఁజని, లోక=జగములను, రక్షణ = సంరక్షించుట యందు, ప్రశస్తంబైన=శ్రేష్ఠమైనట్టి, హస్తంబునన్=కరముచే, అతని యడుగులు=ఆవిప్రుని చరణంబులు, పుడుకుచున్=ఒత్తుచు, మెల్లనన్= చక్కఁగా, అతనికి = ఆ బ్రాహ్మణునికి (అనఁగా బ్రాహ్మణునితో ననుట), ఇట్లు, అనియెన్ = ఈ విధముగాఁ బలికెను.

సీ. జగతీ సురేశ్వర ♦ సంతోష చిత్తుండ
వైయున్న నీ ధర్మ ♦ మతిసులభము

వృద్ధసమ్మత మిది ♦ విత్తమెయ్యదియైన
ప్రాపింప హర్షించు ♦ బ్రాహ్మణుండు
తన ధర్మమున నుండుఁ ♦ దరలఁ డాధర్మంబు
గోరిక లతనికిఁ ♦ గురియుచుండు
సంతోషిగాఁడేని ♦ శక్రుఁడైన నశించు
నిర్ధనుండైనను ♦ నిద్రఁబోవు
ఆ. సంతసించెనేని ♦ సర్వభూత సుహృత్త
ములకుఁ బ్రాప్తలాభ ♦ ముదితమాన
సులకు శాంతులకును ♦ సుజనులకును గర
హీనులకును వినతు ♦ లే నొనర్తు.

టీ. జగతీసురేశ్వర=విప్రోత్తమా! సంతోషచిత్తుండవై=ఆనందించిన మనస్సుగలవాఁడవై, ఉన్న నీ ధర్మము=ఉన్నట్టి నీ నడవడిక, అతి సులభము=మిక్కిలి సరసమైనది. ఇది=ఈ ధర్మము, వృద్ధ=పెద్దలకు, సమ్మతము=ఒప్పిదమయినది, విత్తము=ద్రవ్యము, ఎయ్యదియైనన్=ఎట్టిదయినను, ప్రాపింపన్ = లభింపఁగా, బ్రాహ్మణుండు = విప్రుఁడు, హర్షించున్=ఆనందించును, తనధర్మమునన్=తనయొక్క నడవడికయందు, ఉండున్, తరలఁడు=తప్పిపోఁడు, ఆ ధర్మంబు = అట్టిఆచారము, కోరికలు=ఇష్టములు, అతనికిన్ = ఆ వచ్చినవిప్రునకు, కురియుచుండున్=కలిగించుచుండును, సంతోషిగాఁడు+ఏనిన్ = కౌతుకము లేనివాఁడైన యెడల, శక్రుఁడైనన్=దేవేంద్రుఁడయినను, నశించున్ = నాశనము నొందును, సంతసించెను + ఏనిన్ = ఆనందపడినయెడల, నిర్ధనుండు+ఐనను=బీదవాఁడైనను, నిద్రపోవున్=సుఖముగా నిద్రించును, సర్వభూత = సకలజీవులయందు, సుహృత్తములకున్ = స్నేహముగలవారికి, ప్రాప్తలాభముదిత మానసులకున్ - ప్రాప్త=లభించిన, లాభ = ఫలమువలన, ముదిత = సంతోషించిన, మానసులకున్ = చిత్తముగల

వారికి, శాంతులకును = ఓరిమిగలవారికి (ఇంద్రియముల జయించిన వారికి), సుజనులకు=ఉత్తములయిన పురుషులకును, గర్వహీనులకును = గర్వములేనివారికిని, వినతులు=వందనములను, ఏన్=నేను, ఒనర్తున్=ఒనరింతును (చేయుచున్నమట).

తా. విప్రోత్తమా! సంతోషముతోనున్న నీ నడవడిక మిగుల మంచిది. కోర్కెఫలప్రాప్తికి బ్రాహ్మణుఁ డానందించి యుండును. తన యాచారమును విడుచువాఁడుకాఁడు. అట్టి యానందము గలిగియుండుటవలననే వానియిష్టము లెల్ల నెఱవేఱు చుండును. మహేంద్రుఁడయినను సంతసములేనివాఁడు నాశనమగును. పేదయైనను సంతసము గలవాఁడు సౌఖ్యపడును. కావున సర్వభూతముల యందు దయగల వాండ్రును, తనకున్నదానితోఁ దృప్తినొందువాండ్రును, ఇంద్రియములను జయించినవారును, సజ్జనులును, కోపములేనివారు నగు మిమ్ముఁబోటి వారికి నే ననేక నమస్కారములు చేయుదును.

ఉ. ఎవ్వని దేశమందునికి ♦ ఎవ్వనిచేఁ గుశలంబు గల్గు మీ
కెవ్వని రాజ్యమందుఁ బ్రజ ♦ లెల్ల సుఖింతురు వాఁడు మత్ప్రియుం
డివ్వనరాశిదుర్గమున ♦ కెట్లరుదెంచితివయ్య నీవు నే
నవ్వులుగావు నీతలఁపు ♦ నంగల మేలొనరింతు ధీమణీ. 24

టీ. ధీమణీ=మంచిబుద్ధిగలవాఁడా! మీకు, ఎవ్వని దేశమందున్=ఏరాజేలెడిదేశమున, ఉనికి = నివాసమో, ఎవ్వనిచేన్ = ఎవనిచేత, కుశలంబు=క్షేమము, కల్గున్=కలుగుచున్నదో, ఎవ్వని రాజ్యమందున్ = ఏరాజేలెడి రాజ్యమందు, ప్రజలు=మనుష్యులు, సుఖింతురు = సౌఖ్యపడుదురో, వాఁడు=అట్టివాఁడు (అట్టిరాజు), మత్ప్రియుండు = నాకు హితుండు, ఈ+వనరాశి (త్రికసంధి) ఇవ్వనరాశిదుర్గమునకున్ = ఈ ద్వారకకు (సముద్రముగోటగాఁగలదని), ఎట్లు = ఏవిధముగా, అరుదెంచితివి + అయ్య = ఏతెంచితివయ్యా, నవ్వులు = హాస్యములు (వేళాకోళములు), కావు, నీ తలఁపునన్=చిత్తమునందు, కలమేలు = ఉన్నట్టి మంచిని, నేన్=నేను, ఒనరింతున్=చేయువాఁడను.

తా. బుద్ధిమంతుఁడా! (బ్రాహ్మణోత్తముఁడా) ఏరాజేలెడి రాజ్యంబున నీవు నివసించియుంటివో, ఏరాజేలు దేశమునఁ బ్రజలు సౌఖ్యముగ నున్నారో యట్టి నృపాలుండు నాకు హితుఁడు. అచ్చటి నుండి యిచ్చటకేవిధమునవచ్చితివి? వచ్చినపనింజెల్పిన నేఁజేయుదును.

వ. అని యిట్లు లీలాగృహీత శరీరుండైన యప్పరమేశ్వరుఁ డడిగిన ధరణీసురవరుం డతనికి సవినయంబుగ నిట్లనియె, దేవా! విదర్భదేశాధీశ్వరుండగు భీష్మకుండను రాజు గలం డా రాజుకూఁతురు రుక్మిణి యనుకన్యకామణి గల దయ్యిందువదన నీకుం గైంకర్యంబు సేయంగోరి వివాహ మంగళప్రశస్తంబయిన యొక్క సందేశంబు విన్నవింపు మని పుత్తెంచె నవధరింపుము.

టీ. అని, ఇట్లు=ఈవిధముగా, లీలా=విలాసమునకు, గృహీత=ధరింపబడిన, శరీరుండు=ఒడలుఁ గలవాఁడు (అనఁగా పరమేశ్వరుఁడు దేహములేనివాఁడని భావము), ఐన + అప్పరమ+ఈశ్వరుఁడు = ఐన ఆపరబ్రహ్మ స్వరూపుఁడగు కృష్ణుండు, అడిగినన్ = అడుగఁగా, ధరణీసురవరుండు = విప్రోత్తముఁడు, సవినయంబుగాన్ = నమ్రతతో, ఇట్లు = ఈ విధముగా, అనియెను = పలికెను, దేవా=ఓకృష్ణస్వామీ! విదర్భదేశాధీశ్వరుండు (విదర్భ + దేశ + అధీశ్వరుండు)=విదర్భ యను దేశమును పాలించువాఁడు అగు భీష్మకుండు అనురాజు, కలండు = కలఁడు (ఉండెను), ఆ రాజు కూఁతురు, రుక్మిణి యను =రుక్మిణి అను పేరు గల, కన్యకామణి = బాలికామణి, కలదు = ఉన్నది, అయ్యిందువదన (ఆ+యిందువదన) = చంద్రునివంటి ముఖముగల యా రుక్మిణి, నీకున్ = నీకు, కైంకర్యంబు = సేవ, సేయంగోరి = చేయునట్టి కోరిక గలదియై, వివాహ = పెండ్లియను, మంగళ = శుభమువలన, ప్రశస్తంబు=ఖ్యాతి నొందినది, ఐన = అయినట్టి, ఒక్క-సందేశంబు =

ఒకవార్తను, విన్నవింపుము = తెలియఁజేయుము (అనఁగా విన్నప రూపమునఁ జెప్పుము), అని పుత్తెంచెన్ = (నన్ను) పంపించెను, అవధరింపుము = చిత్తమునకుఁ దెమ్ము (అనగా నేజెప్పఁబోవు సమాచారమననుట),

సీ. ఏ నీగుణములు క ♦ ర్ణేంద్రియంబులు సోఁక
దేహతాపంబులు ♦ దీఱిపోవు
నే నీ శుభాకార ♦ మీక్షింపఁగన్నుల
కఖిలార్థలాభంబు ♦ గలుగుచుండు
నే నీ చరణసేవ ♦ లేప్రొద్దు చేసిన
భువనోన్నతత్వంబుఁ బొందఁ గలుగు
*నే నీ లసన్నామ ♦ మేప్రొద్దు భక్తితోఁ
దలఁచిన బంధ సం ♦ తతులు వాయు

తే. గీ. నట్టినీయందు నాచిత్త ♦ మనవరతము
నచ్చియున్నది నీయాన ♦ నానలేదు
కరుణఁజూడుము కంసారి ఖలవిదారి
శ్రీయుతాకార! మానినీ ♦ చిత్తచోర! 16

టీ. కంసారి = కంసునకుశత్రువైనవాఁడా, ఖల=దుర్మార్గులను, విదారి=చీల్చునట్టివాఁడా, శ్రీయుత=మహాలక్ష్మితో గూడిన, ఆకార= ఆకృతిగలవాఁడా, మానినీ = మానవతులైనసుందరులయొక్క, చిత్త=

*ధర్మ, అర్థ, కామ, మోక్షములు = పురుషార్థములు. "ఏ నీ లసన్నామమేప్రొద్దు భక్తితోఁ దలఁచిన" అనుదానికిఁ "దడవిన" అనుపాఠాంతరమున్నను "తలఁచిన" అనునదియే "తడవిన" అను పాఠముకన్న వేయిమడుంగులు స్వారస్యము కలిగినదనవచ్చును. కంసుఁడు=ఉగ్రసేనుని కొడుకు, మధురాపురమునకు రాజు. శ్రీకృష్ణుని

మనస్సును, చోర=హరించువాఁడా (మానవతులు నిన్ను కోరుచుందురనుట), ఏనీగుణములు=ఎట్టినీమంచిగుణములు, కర్ణ+ఇంద్రియంబులు=శ్రోత్రములను నింద్రియములు, సోఁకన్=తగులఁగా (అనగాఁ జెవినిబడఁగాననుట). దేహతాపంబులు=ఒడలియొక్క బాధలు, తీఱిపోవున్ = అణఁగునో, ఏనీ శుభాకారము = ఎట్టినీశుభప్రదమగు రూపము, ఈక్షింపన్=కనుఁగొనఁగా, కన్నులకున్ = నేత్రములకు, అఖిల + అర్థలాభంబులు=సకల పురుషార్థఫలంబులును, అబ్బుచుండున్ = సంప్రాప్తమగుచుండునో, ఏ నీచరణసేవలు = ఎట్టి నీపాదసేవలు, ఏప్రొద్దున్ = ప్రతిదినము, చేసినన్ = కొంచినయెడల, భువన = లోకమునందు, ఉన్నతత్వంబున్=ఘనత్వమును (గొప్పతనమును), పొంద గలుగున్ = చేసికొననగునో, ఏనీ = ఎట్టినీయొక్క, లసత్ = ప్రకాశించుచున్న (ప్రఖ్యాతినొందియున్న), నామము = పేరును, ఏప్రొద్దు=ఎల్లప్పుడును, భక్తితోన్, తలంచినన్, బంధసంతతులు = సంసారబంధ సముదాయములు, వాయున్=పోవునో, అట్టినీయందున్, నాచిత్తము = నాహృదయము, అనవరతము=అన్నివేళలను, నచ్చియున్నది=ఇష్టపడియున్నది, నీయాన=నీయాజ్ఞ, నాన=లజ్జ, లేదు, కరుణన్=ప్రేమతో, చూడుము=నన్నుఁగనుంగొనుము.

తా. ఓకృష్ణా! నీసద్గుణములు వినినంతనే శరీరబాధ లడంగును. నీ యాకారముఁ గనులగాంచిన సకల పురుషార్థములు లభించును. నీపాదసేవవలన గొప్పతనముగలుగును. నీపేరుయుచ్చరించిన సంసార దుఃఖములుమానును. ఇట్టిగుణమణివగు నీయందు నా చిత్తము హత్తియున్నది. నిన్నుగోర నామనస్సు లజ్జించుటలేదు. కావునఁ గృపతో నన్నేలుకొనుము.

---

మేనమామ. ఈతఁడు పూర్వజన్మమునందు కాలనేమియను రాక్షసుఁడు. "నీచెల్లెలియొక్క యెనిమిదవకొడుకు నిన్నుజంపును." అను ఆకాశవాణి పలుకులు విని శ్రీకృష్ణుని యన్నలజంపి వ్రేపల్లెలో బెరుగుచున్నట్లు విని వానిని జంపఁబోయి కృష్ణునిచేతిలోఁ దానే మృతినొందెను.

శా. ధన్యున్ లోకమనోభిరాముఁ గుల వి ♦ ద్యారూప
తారుణ్య సౌ, జన్యశ్రీబలదానశౌర్య కరుణా ♦ సంశో
భితున్ నిన్ను నే, కన్యల్గోరరు గోర దే మును రమా ♦
కాంతాలలామంబు రా, జన్యానేకపసింహ నావలన నే ♦
జన్మించెనే మోహముల్. 27

టీ. రాజన్య + అనేకపసింహ = రాజోత్తములను నేనుంగులకు సింహమువంటివాఁడా! ధన్యున్=సుకృతముగలవానిని, లోకమన = ప్రజలచిత్తములకు, అభిరామున్ = అందమైనవానిని, కుల = కులము చేతను, విద్యా=చదువుచేతను, రూప=రూపము (సౌందర్యము) చేతను, తారుణ్య = వయస్సుచేతను, సౌజన్య=మంచితనముచేతను, శ్రీ=లక్ష్మి చేతను, బల=సత్త్వముచేతను, దాన = వితరణచేతను, శౌర్య=శూరత చేతను, కరుణా=కృపచేతను, సంశోభితున్=ప్రకాశించువానిని, నిన్ను= నిన్ను, ఏకన్యల్=ఏబాలికలు, కోరరు=కోరకుందురు? (కోరుదురనుట), మును = మునుపు, రమాకాంతాలలామంబు=లక్ష్మియను సుందరీమణి, కోరదు+ఏ=కోరదా (కోరినదనుట), నావలననే=నాచేతనే, మోహముల్ = కోరికలు (వలపులు), జన్మించెన్+ఏ=పుట్టెనా.

తా. కులవిద్యాదులచేఁ బ్రకాశించు పుణ్యాత్ముని నిన్నుఁగోరు కొనని కన్యామణులుండరు, కనుక లక్ష్మిదేవి వలపున నిన్నుఁగోరు, కొనినదిగదా! ఆవిధముగా నేనును గోరుట తప్పుకాదు.

ఉ. శ్రీయుతమూర్తి యోపురుష ♦ సింహమ సింహముపాలి
సొమ్ము, గో మాయువుగోరుచందమున ♦ మత్తుఁడు
చైద్యుఁడు నీపదాంబుజ, ధ్యాయినియైన నన్ను వడిఁ ♦ దా
గొనిపోయెద నంచునున్న వాఁ, డా యధమాధముండెఱు
గఁ ♦ డద్భుతమైన భవత్ప్రతాపమున్. 28

టీ. శ్రీయుత=లక్ష్మితోఁగూడిన, మూర్తి=శరీరముగలవాఁడా! ఓ పురుషసింహమ=ఓ మనుజోత్తముఁడా (కృష్ణాయని సంబోధనము), సింహముపాలిసొమ్ము=సింగముయొక్క భాగమైయున్న ద్రవ్యమును, (అనఁగా సింహముదగ్గఱనున్న మాంసమును), గోమాయువు = నక్క, కోరు చందమునన్ = కోరుకొనుకీతిగా, మత్తుఁడు = మదించినవాఁడు, (అయిన) చైద్యుఁడు=శిశుపాలుఁడు, నీపదాంబుజ=నీ పాదపద్మములను, ధ్యాయినిన్=ధ్యానముచేయునది, ఐనన్నున్=అయినట్టినన్ను, వడిన్= శీఘ్రముగా, తాన్=తాను (శిశుపాలుఁడు), కొనిపోయెడన్ = తీసికొని పోయెదను, అంచున్=అనుచు, ఉన్నవాఁడు=ఉండెను, ఆ యధమ + అధముండు= నీచులలో నీచుఁడగువాఁడు, అద్భుతము = ఆశ్చర్యము, అయిన=అయినట్టి, భవత్ప్రతాపమున్=నీ పరాక్రమమును, ఎఱుఁగఁడు= తెలిసికొనఁజేరఁడు.

తా. ఓ కృష్ణా! సింహముసొత్తును నక్క కోరినవిధమున శిశుపాలుండు నీ ప్రతాపము నెఱుంగక నీ సొమ్మైన నన్ను గాంక్షించుచున్నాఁడు. ఉపమాలంకారము.

మ. వ్రతముల్ దేవగురుద్విజన్మబుధసే ♦ వల్ దానధర్మాదు
లున్ । గతజన్మంబుల నీశ్వరున్ హరిజగ ♦ త్కల్యాణుఁ
గాంక్షించి చే । సితి నేనిన్ * వసుదేవనందనుఁడు నా ♦
చిత్తేశుఁడౌఁగాక ని । ర్జితులై పోదురుగాక సంగరము
లోఁ ♦ జేదీశముఖ్యాధముల్.

టీ. వ్రతములు = నోములు, దేవ = దేవతలయొక్క, గురు = ఒజ్జలయొక్కయు, ద్విజన్మ= బ్రాహ్మణులయొక్కయు, బుధ = పెద్దల (పండితుల) యొక్కయు, సేవలు = పరిచర్యలు, దాన = దానములు,

* వసుదేవుఁడు= ఆనకదుందుభి శూరుని కుమారుఁడు, దేవకీదేవి మగఁడు, కృష్ణ బలరాములతండ్రి, కొందఱు కశ్యపుఁడు వసుదేవుఁడుగాను, అదితి దేవకిగాను పుట్టిరని చెప్పెదరు.

ధర్మ+ఆదులున్=ధర్మములు మున్నగాఁగలవానిని, గతజన్మంబులన్= గతించిన పుట్టువులయందు, ఈశ్వరున్= భగవంతుని, జగత్ కల్యాణున్=ప్రపంచమునకు మేలుగూర్చెడివానిని, హరిన్= విష్ణుమూర్తిని, కాంక్షించి= కోరుకొని, చేసితినేనిన్ = ఒనరించినయెడల, వసుదేవ= వసుదేవుని, నందనుఁడు= కుమారుఁడగు కృష్ణుఁడు, నా= నాయొక్క, చిత్త+ ఈశుఁడు= ప్రాణప్రియుఁడు+ఔ గాక=అగునుగాక, చేది + ఈశ + ముఖ్య + అధములు్= చేదిదేశపురాజగు శిశుపాలుఁడు మొదలైన యల్పులు, సంగరములో= యుద్ధమందు, నిర్జితులు + ఐ = ఓడిపోయినవారై, పోదురుగాక=నశింతురుగాక.

తా. నేను తొల్లింటి పుట్టువున భగవంతునికిఁ బ్రీతిగా మంచి పను లొనర్చినచో, ఈపుట్టువున నాకు కృష్ణుఁడు ప్రాణనాథుఁడు కావలయు. శిశుపాలాది నీచులు యుద్ధమున నపజయము పొందవలయును.

ఉ. అంకిలి సెప్పలేదు చతు ♦ రంగబలంబులతోడ నెల్లియో
పంకజనాభ నీవు శిశు ♦ పాల జరాసుతులన్ జయించినా
వంకకువచ్చి రాక్షసవి♦ వాహమునన్ భవదీయశౌర్యమే
యుంకువచేసికృష్ణపురుషోత్తమ చేకొనిపొమ్మువచ్చెదన్.

టీ. అంకిలి = అడ్డగింత, చెప్పలేదు = వచించిన దానను గాను, చతురంగబలంబులతోడన్= రథములు, ఏనుఁగులు, గుఱ్ఱములు, కాల్బలములుగల సేనతో, ఎల్లి= రేపు, ఓ పంకజనాభ= పద్మము నాభియందుఁగల ఓకృష్ణా! నీవు, శిశుపాల జరాసుతులన్ = శిశుపాలుని, జరాసంధుని, జయించి = ఓడించి, నావంకకున్ = నావైపునకు, వచ్చి=ఏతెంచి, రాక్షసవివాహమునన్=బలత్కారముగ బెండ్లికూఁతు నెత్తుకొనిపోయి చేసికొను వివాహ రూపమున, భవదీయ శౌర్యమే = నీ యొక్క పరాక్రమమునే, ఉంకువ = ఓలి, చేసి, కృష్ణ! పురుషోత్తమ = పురుషులలో శ్రేష్ఠుఁడా ! చేకొనిపొమ్ము = తీసికొనిపొమ్ము, వచ్చెదన్ = వచ్చెదను.

తా. సేనాసమేతుండవై వచ్చి శిశుపాలుఁడు మొదలైన దుష్టుల జయించి, కృష్ణా! నన్నుఁ దీసికొనిపొమ్ము, సిద్ధముగ నుంటిని.

సీ. లోపలి సౌధంబు ♦ లోన వర్తింపంగఁ
దేవచ్చు నే నిన్నుఁ ♦ దెత్తునేనిఁ
గావలివారలఁ ♦ గలబంధువులఁ జంపి
కాని తేరాదని ♦ కమల నయన
భావించెదేని యు ♦ పాయంబు సెప్పెద
నాలింపు కులదేవ ♦ యాత్రఁ జేసి
నగరంబు వెలువడి ♦ నగజాతకును మ్రొక్కఁ
బెండ్లికిమునుపడఁ ♦ బెండ్లికూఁతు

తే. నెలమి మావారు పంపెద ♦ రేను నట్ల
పురము వెలువడి యేతెంచి ♦ భూతనాథు
సతికి మ్రొక్కంగ నీవు నా ♦ సమయమందు
వచ్చి కొనిపొమ్ము నన్ను న ♦ వార్య చరిత.

టీ. లోపలి, సౌధంబులోనన్=అంతఃపురంబున, వర్తింపఁగన్=తిరుగుచుండఁగా, నిన్ను, తేన్+వచ్చును+ఏ = ఎట్లుతీసికొనివచ్చెదను, తెత్తును+ఏని = తెచ్చినయెడల, కావలివారిన్ = కాపున్నబంటులను, కల = అచటనున్న, బంధువులను = చుట్టములను, చంపికాని = చంపకుండ, తేరాదు = తెచ్చుటకువీలులేదు, అని, కమలనయన = పద్మముల వంటినేత్రములుగల కృష్ణా! భావించెదు + ఏని = తలంతువేని, ఉపాయంబు=ఆలోచనము, చెప్పెదన్=చెప్పెదను, ఆలింపుము=ఆలకింపుము, కులదేవయాత్రఁజేసి = కులదైవమును సేవించునిమిత్తము, నగరంబున్=పురమునుండి, వెలువడి = బయలుదేఱి, నగజాతకును = గౌరీదేవికి, మ్రొక్కన్=వందనము చేయుటకు, పెండ్లికి మునుపడన్ = వివాహము

నకు ముందు, పెండ్లికూఁతున్ = పెండ్లికొబోవుచిన్నదానిని, ఎలమిన్ = కౌతుకముతో, మావారు = మాతల్లితండ్రులు, పంపుదురు, ఏనుఁ = నేనును, అట్లు + అ = ఆవిధముగనే, పురమున్ = నగరమును, వెలువడి = బయలువెడలి, ఏతెంచి = వచ్చి, భూతనాథుసతికిన్ = ఈశ్వరుని భార్యయైన పార్వతికి, మ్రొక్కఁగన్ = నమస్కారము చేయుచుండ, అవార్యచరిత = వారింపరాని చరిత్ర కలవాఁడా ! నీవు, ఆసమయమందు = అప్పుడు, వచ్చి, నన్ను, కొనిపొమ్ము = తీసికొని పొమ్ము.

తా. అంతఃపురమున నున్న నిన్ను తీసికొనివచ్చుట కష్టము. ఒకవేళ తీసికొనిరాఁగలిగిన నచటిబంట్లను చుట్టములను చంపకుండవీలులేదు, అని నీవు తలఁచినచో నీకొక యాలోచన చెప్పెదను వినుము. పెండ్లికి ముందుగా దేవాలయమునకుఁ బంపు నాచారము మాలోఁగలదు. కావున నేను దుర్గాలయమున కూరిబయటకు వచ్చినపుడు నీవు వచ్చి నన్ను కొనిపొమ్ము.

మ. ఘనులాత్మీయతమోనివృత్తికొఱకై ♦ గౌరీశుమర్యాదనె
వ్వని పాదాంబుజతోయమందు మునుఁగన్ ♦ వాంఛింతురే
నట్టినీ,యనుకంపన్ విలసింపనేనివ్రత♦చర్యన్ నూఱుజన్మం
బులన్, నినుఁజింతించుచుఁ బ్రాణముల్ విడిచెదన్ ♦
నిక్కంబు ప్రాణేశ్వరా!

టీ. ప్రాణేశ్వరా = ప్రాణనాథా ! ఘనులు = గొప్పవారు, ఆత్మీయ=తమదైన, తమ=అజ్ఞానమును, నివృత్తికొఱకున్ = పోగొట్టుకొనుటకు, గౌరి + ఈశుమర్యాదన్ = శివునివలె, ఎవ్వని = ఎవని యొక్క, పాదాంబుజ = చరణపద్మపు, తోయమందున్ = ఉదకమందు, మునుఁగన్ = స్నానమాడుటకు, వాంఛింతురు = కోరెదరో, ఏను = నేను, అట్టిదను, నీ + అనుకంపన్ = నీయొక్క దయను, విలసింపను+ఏని = ప్రకాశింపనిచో, వ్రతచర్యన్ = నోములుజరుపుట

చేత, నూఱుజన్మంబులన్ = అనేకములగు పుట్టువులయందు (ఇక్కడ నూఱుఅనుట సంఖ్యను నిర్ణయించుట కాదు. అనేకార్థద్యోతకము), నిన్నున్ = నిన్ను, చింతించుచున్ = ధ్యానముచేయుచు, ప్రాణముల్ = జీవములను, విడిచెదన్ = వదలెదను, నిక్కంబు = నిజము.

తా. ప్రాణనాథా ! మహానుభావులైనవారు తమ యవిద్యా నాశనమునకై యే ఘనుని పాదోదకమును జేకొందురో, అట్టి నీ కృపకు నేను తగినదానను గాకున్నచో, ఎన్నిజన్మములకైన నిన్ను ధ్యానము చేయుచు ప్రాణముల విడిచెదను.

సీ. ప్రాణేశ నీమంజు ♦ భాషలు వినలేని
కర్ణరంధ్రంబులు ♦ కలిమి యేల
పురుషరత్నమ నీవు ♦ భోగింపఁగాలేని
తనులతవలని సౌం ♦ దర్య మేల
భువనమోహన నిన్నుఁ ♦ బొడగానఁగా లేని
చక్షు రింద్రియముల ♦ సత్వమేల
దయిత*నీ యధరామృ ♦ తంబానఁగా లేని
జిహ్వకు ఫలరస ♦ సిద్ధియేల
ఆ. నీరజాతనయన ♦ నీవనమాలికా
గంధ మబ్బలేని ♦ ఘ్రాణమేల
ధన్యచరిత నీకు ♦ దాస్యంబుసేయని
జన్మ మేల యెన్ని ♦ జన్మములకు.

టీ. ప్రాణేశ=ప్రాణనాథా ! కృష్ణా! నీమంజుభాషలు=నీమృదు వాక్యములు, వినలేని = వినజాలని, కర్ణరంధ్రంబులు = శ్రుతిపుటముల

---

*"దయిత నీదు కథామృతము చవిగొనలేని జిహ్వకు ఫలరస సిద్ధియేల" అని పాఠాంతరము. ఇంద్రియవ్యాపారముల వర్ణించు

యొక్క, కలిమి=ఉండుట, ఏల=ఎందుకు? (ఏమి ప్రయోజనమనుట), పురుషరత్నమ = పురుషశ్రేష్ఠుఁడా! నీవు, భోగింపఁగాలేని=పొందుట కర్హముగాని, తనులతవలని=తీఁగవంటి యొడలిదైన, సౌందర్యము = అందము, ఏల=ఎందుకు? భువనమోహన=ప్రపంచములను మోహింపఁ జేయువాఁడా! నిన్నున్ = నిన్ను, పొడఁగానఁగాలేని = చూడలేని, చక్షు+ఇంద్రియముల=నేత్రేంద్రియములయొక్క, సత్వము=బలసంపద, ఏల=ఎందుకు? దయిత=ప్రియుఁడా, నీయధర+అమృతంబు=నీమోవి యందలి తేనెను, ఆనలేని=చవిచూడలేని, జిహ్వకున్ = నాలుకకు, ఫలరససిద్ధి=పండ్లరసముయొక్క సంపత్తి, ఏల=ఎందుకు? నీరజాత నయన=పద్మములవంటి నేత్రములు గలవాఁడా, నీవనమాలికాగంధము= నీవనమాలయొక్క సువాసన, అబ్బలేని=పొందజాలని, ఘ్రాణము = నాసిక, ఏల=ఎందుకు? ధన్యచరిత = పుణ్యచరిత్రము కలవాఁడా, నీకున్=నీకు, దాస్యంబు, సేయనిజన్మము = ఊడిగము సేయనిపుట్టుక, ఎన్ని జన్మంబులకున్=ఎన్నిపుట్టువులకైనను, ఏల=ఏమిప్రయోజనము (లేదనుట.)

తా. కృష్ణా! నీ పలుకు లాలింపని చెవులు, నీ యొడలితోఁ గలయికలేని యందము, నిన్నుఁగనజాలని నేత్రములు, నీ యధరామృతంబానని నాలుక, నీ వనమాలపరిమళము నాఘ్రాణింపని నాసిక, నీకు సేవ సేయని బ్రతుకును నిరర్థకము.

---

నెపంబునఁగవి గల్పించిన మృదువాక్యములు భోగించుట, చూపు అధరామృతము అను నీ వాక్యములు హృదయంగమములు. "కథామృతము చవిగొనలేని" అను పాఠాంతరమున సరసమేమియులేదు. మంజుభాషలని యొక చరణమునఁ బెట్టి మరల కథలు అని పెట్టుట గూడ నంత సమంజసముఁగాగాన్పించదు. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము లైదింటిలో సహజముగురసము అధరామృతముననేగాని కథామృతమునన్నుండదు. కావున మొదటి పాఠమే కవిసమ్మతము.

వ. అని యిట్లు రుక్మిణీదేవి పుత్తెంచిన సందేశంబును రూప
సౌందర్యాది విశేషంబులును బ్రాహ్మణుండు హరికి
విన్నవించి, కర్తవ్యంబెద్ది సేయ నవధరింపుమని సవర్ణ
నంబుగా మఱియు నిట్లనియె. 34

టీ. అని, ఇట్లు = ఈవిధముగా, రుక్మిణీదేవి, పుత్తెంచిన = పంపినట్టి, సందేశంబును = వార్తను, రూపసౌందర్యమును + ఆది విశేషంబులును=స్వరూపము సౌందర్యము మున్నగువాని గొప్పదనమును, బ్రాహ్మణుండు, హరికిన్=శ్రీకృష్ణునకు, విన్నవించి=మనవిచేసికొని, కర్తవ్యంబు=చేయనున్నది, ఎద్ది=ఎయ్యది, చేయన్=చేయుటకు, అవధరింపుము = ఆలోచనచేయుము, అని, సవర్ణనంబుగా = చక్కగా, మఱియున్=ఇంకను, ఇట్లు, అనియెన్=పలికెను.

సీ. పల్లవ వైభవా ♦ స్పదములు పదములు
కనకరంభా తిర ♦ స్కారు లూరు
లరుణప్రభా మనో ♦ హరములు కరములు
కంబుసౌందర్య మం ♦ గళము గళము
మహిత భావాభావ ♦ మధ్యంబు మధ్యంబు
చక్షు రుత్సవదాయి ♦ చన్నుదోయి
పరిహసితార్ధేందు ♦ పటలంబు నిటలంబు
జిత మత్త మధుకర ♦ శ్రేణి వేణి

ఆ. భావజాశుగముల ♦ ప్రాపులు చూపులు
కుసుమశరునివింటి ♦ కోమలు బొమలు
చిత్తశోషణములు ♦ చెలువ భాషణములు
జలజనయన ముఖము ♦ చంద్రసఖము. 35

టీ. పల్లవవైభవ+ఆస్పదములు=చిగుళ్ళయొక్క యందమునకు స్థానములు, పదములు=చరణములు, కనకరంభా=బంగారుఅనఁటులను, తిరస్కారులు=నిందించునవి, ఊరులు=తొడలు, అరుణప్రభా = రక్తకాంతిచే, మనోహరములు = మనస్సునకింపయినవి, కరములు = హస్తములు, కంబు = చిందముయొక్క (శంఖముయొక్క), సౌందర్య = అందమువలె, మంగళము=శుభమైనది, గళము=కుత్తుక, మహితభావ + అభావ=ఒప్పుచున్న అగపడి అగపడని, మధ్యంబు=నడుము, చక్షుః= కనులకు, ఉత్సవ=సంతోషమును, దాయి =చేయునది (నేత్రోత్సవము గలుగంజేయునది) చన్నుదోయి = స్తనద్వయము, పరిహసిత=మిక్కిలి హేళనము చేయఁబడిన, అర్థ+ఇందు పటలంబు=సగము చందురుని యొక్క బింబముకలది, నిటలంబు=ముఖము (అనగా ఫాలమనిభావము) జిత=జయింపఁబడిన, మత్త=మదించిన, మధుకరశ్రేణి=తుమ్మెదలచాలు, వేణి=జడ, భావజ = మన్మథునియొక్క, ఆశుగములు = బాణములకు, ప్రాపులు = ఉనికిపట్టులు, చూపులు = దృక్కులు, కుసుమశరుని = మదనునియొక్క, వింటికొమలు=చాపముయొక్క కొమ్ములు, బొమలు= కనుబొమలు, చిత్తతోషణములు=మనస్సును సంతోషపెట్టునవి, చెలువ భాషణములు = రుక్మిణిపలుకులు, చంద్రసఖము = చంద్రునితో మైత్రి నెఱపునవి, జలజనయనముఖము = పద్మములవంటి నేత్రములుగల రుక్మిణిముఖము.

తా. మెత్తనిపాదములు, మృదువైనయూరువులు, ఎఱ్ఱనిహస్తములు, అందమైనకంఠము, సన్ననినడుము, నేత్రపర్వమునుగూర్చు పాలిండ్లు, సగము చంద్రునివంటి నుదురు, నల్లని శిరోజములు, మదన బాణసమానములగు చూడ్కులు, మన్మథుని ధనుస్సుంబోలిన భ్రూయుగముగల రుక్మిణీదేవియొక్క మాటలు చిత్తానందము గలుగఁజేయుచుండుటయేగాక చంద్రునితో సరిగ మోము ప్రకాశించుచున్నది.

ఉ. ఆయెలనాఁగ నీకుఁదగు ♦ నంగనకుం దగు దీవు మా
యుపా। ధ్యాయుల యాన పెండ్లియగుఁ ♦ దప్పదు జాడ్య

ము లేల నీవు నీ। తోయమువారిఁ గూడుకొని♦ తోయరు
హాననఁ దెత్తుగాని। విచ్చేయుము శత్రులన్ నుఱుము ♦ సే
యుము సేయుము శోభనంబిలన్. 36

టీ. ఆ+ఎలనాఁగ=ఆరుక్మిణి, నీకున్ = నీకు, తగున్=ఒప్పును, అంగనకున్=ఆరుక్మిణికి, ఈవు=నీవు, తగుదువు = ఒప్పెదవు, మా+ఉపాధ్యాయుల+ఆన = మాగురువుగారితోడు, పెండ్లి = వివాహము, అగున్=అగును, తప్పదు=నిశ్చయము, జాడ్యములు = ఆలసించుటలు, ఏల = ఏటికి, నీవు, నీతోయమువారిన్ = నీపరివారమును, కూడుకొని = కలిసి, తోయరుహ+ఆననన్ = పద్మములవంటి కనులు గల రుక్మిణిని, తెత్తు = తోడ్కొనివత్తువు, కాని = కావున, విచ్చేయుము= రమ్ము, శత్రులన్=విరోధులను, నుఱుముసేయుము = పిండిసేయుము, ఇలన్ = ధాత్రియందు, శోభనంబు=శుభము, చేయుము=కావింపుము.

తా. శ్రీకృష్ణా! మీ రిరువురను దాంపత్యమునకుఁ దగినవారు. తప్పక మీ యిద్దఱికిఁ బెండ్లియగును. కావున నీ వెంతమాత్రమును ఆలస్యము సేయక పరివారముతోఁ గూడి వచ్చి విరోధులను జయించి రుక్మిణిం దెచ్చు విషయమున లోకమునకు శుభము సేయుము.

వ. అని యిట్లు పలికిన బ్రాహ్మణునివలన విదర్భరాజతనయ పుత్తెంచిన సందేశంబును రూప సౌందర్యాది విశేషంబులను విని యవధరించి నిజకరంబున నతని కరము బట్టి నగుచు నయ్యాదవేంద్రుం డిట్లనియె. 37

టీ. అని, ఇట్లు=ఈ ప్రకారము, పలికిన=మాటలాడిన, బ్రాహ్మణునివలనన్=విప్రునిచే, విదర్భరాజతనయ = భీష్మకుని కుమార్తెయగు రుక్మిణి, పుత్తెంచి = తెలియఁజేయుబంపిన, సందేశంబును = విషయమును, రూపసౌందర్య + ఆదివిశేషంబులును = ఆకారము, అందము మున్నగువానిఘనతను, వినన్=ఆలకింప, అవధరించి = ఒప్పుకొని, ని

కరతలమునన్=స్వహస్తముతో, అతనికరంబు=ఆబ్రాహ్మణునిహస్తమును, పట్టి=పట్టుకొని, నగుచున్=నవ్వుచు, ఆ + యాదవ + ఇంద్రుడు= ఆ యదుకులోత్తముడగు కృష్ణుడు, ఇట్లు, అనియెన్ = అనెను.

ఉ. కన్నియమీఁద నాతలఁపు ♦ గాఢముకూరుకురాదు రేయి

నా । కెన్నఁడు నావివాహము స ♦ హింపక రుక్మిదలంచు

కీడునే । మున్నెఱుఁగుదుం * బరుల ♦ మూఁకవధించి

కుమారిఁదెత్తు వి । ద్వన్నుత ! మ్రానుఁద్రచ్చి నవ ♦

వహ్ని శిఖన్వడిఁ దెచ్చుకైవడిన్. 33

టీ. కన్నియమీఁదన్=రుక్మిణియందు, నాతలఁపు = నావాంఛ, గాఢము = ఎక్కువ, నాకున్ = నాకు, ఎన్నఁడున్ = ఎప్పుడును, రేయి = రాత్రి, కూరుకు = నిదుర, రాదు = రాకున్నది, రుక్మి = రుక్మిణియన్న, నావివాహమున్=నాతోవివాహసంబంధమును, సహింపక=ఇష్టపడక, తలంచు=చేయనెంచిన, కీడు = అపకారము, నేన్ = నేను, మున్నె = పూర్వమే, ఎఱుంగుదున్ = ఎఱుఁగుదును, విద్వత్ + నుత = పండితులచేఁ బొగడఁబడిన, బ్రాహ్మణుఁడా! మ్రానున్ = కొయ్యను, త్రచ్చి = మథించి, నవవహ్నిశిఖన్ = క్రొత్తఅగ్నిజ్వాలను,

---

* "పరులమూఁక నడంచి" అను పాఠాంతరము కలదు. అడంచి యనినను, వధించియనినను అర్థమొక్కటియే యగుటచేఁ బదభేదమయిన పాఠాంతరముకాని, యర్థ భేద పాఠాంతరముకాదు. అడంచియనుటకు జయించి యను యర్థము వ్రాసినను వధియించి యనునర్థమే స్ఫుటమగును. "నవవహ్నిశిఖిన్" అని భాగవతములోని పెద్దతప్పును దెచ్చిపెట్టి రుక్మిణీకల్యాణఘట్టమును వేరుగా నచ్చువేయువారు వాడుచున్నారు. ఒకవేళ అచ్చుపొరపాటనుకొందమన్నను పద్యములోను, అర్థములోను గూడ నవవహ్నిశిఖన్ అనియే వేయుచు, అర్థము మాత్రము జ్వాలయని వేయుచున్నారు. వహ్నియన్నను శిఖియన్నను యర్థమొక్కటే కావున శిఖ యనవలెను.

తెచ్చుకై వడిన్ = తెచ్చువిధముగా, పరులమూఁకన్=విరోధివర్గమును, వధించి = చంపి, వడిన్ = శీఘ్రముగా, కుమారిన్ = రుక్మిణిని, తెత్తున్ = తీసుకొనివచ్చెదను.

తా. బ్రాహ్మణోత్తమా! రుక్మిణికి నాయందుఁగలకీర్తి నాకును రుక్మిణియం దనురాగము గలదు. కావున కొయ్యను కొయ్యచే రాపాడించి క్రొత్తగా నగ్నిని బుట్టించి తెచ్చునట్లు విరోధులను జయించి రుక్మిణిని దీసికొనివచ్చెదను. (ఉపమాలంకారము.)

క. వచ్చెద విదర్భభూమికిఁ
జొచ్చెద భీష్మకునిపురము ♦ సురుచిరలీలం
దెచ్చెద బాలన్ వ్రేల్మిడి
వ్రచ్చెద నడ్డంబు రిపులు ♦ వచ్చినఁబోరన్. 39

టీ. విదర్భభూమికిన్=విదర్భదేశమునకు, వచ్చెదన్=వచ్చెదను, భీష్మకుని పురమున్ = భీష్మకునినగరమగు కుండినపురమును, సురుచిరలీలన్=మిగుల మనోహరములగు విలాసముతో, చొచ్చెదన్=ప్రవేశించెదను, బాలన్=బాలికను, వ్రేల్మిడిన్=వేగముగా, తెచ్చెదన్=తీసికొనివచ్చెదను, పోరన్=యుద్ధమునందు, రిపులు = విరోధులు, అడ్డంబు = అడ్డు, వచ్చినన్ = వచ్చినయెడల, వ్రచ్చెదన్ = చీల్చివేయుదును.

తా. విదర్భదేశమునంగల కుండిననగరముం జొచ్చి విరోధుల జయించి రుక్మిణిందీసికొని వచ్చెదను.

వ. అని పలికి రుక్మిణీదేవి పెండ్లినక్షత్రంబు దెలిసి తన పంపున రథసారథియైన * దారుకుండు సైన్య సుగ్రీవ మేఘపుష్ప వలాహకంబులను తురంగంబులంబూన్చి రథమాయితంబుచేసి తెచ్చిన నమోఘమనోరథుండైన హరి తానును బ్రాహ్మణుండును రథారోహణంబుచేసి

* దారుకుఁడు, దారకుఁడు అని రెండురూపములు గలవు.

యేకరాత్రంబున నావర్తక దేశంబులు గడచి విదర్భ
దేశమునకుంజనియె నందుఁ గుండినపురీశ్వరుండైన
భీష్మకుండు కొడుకునకు వశుండై కూఁతుశిశుపాలునికిచ్చు
నట్టు తలంచి శోభనోద్యోగంబులు సేయించె నప్పుడు.

టీ. అని, పలికి=చెప్పి, రుక్మిణీదేవి పెండ్లినక్షత్రంబు = రుక్మిణీదేవి వివాహమున కనువైన నక్షత్రముతోఁ గూడిన ముహూర్తమును (లగ్నమును,) తెలిసి = తెలిసికొని, తనపంపునన్ = తనయానతిచే, రథసారథి=తేరునడుపువాఁడు, ఐన దారుకుండు = అయిన దారుకుఁడనువాఁడు, శైన్య, సుగ్రీవ, మేఘ, పుష్ప, వలాహకంబులు, అను = అనునట్టి పేరుగల, తురంగంబులన్ = అశ్వములను పూన్చి = బంధించి (రథమున కనుట), రథము=స్యందనమును, ఆయితంబుచేసి = సిద్ధముచేసి, తెచ్చినన్ = తీసికొనిరాఁగా, అమోఘ = నిష్ఫలముగాని, మనోరథుండు, కోర్కెలుకలవాఁడు, ఐన హరి = అయిన కృష్ణుండు, తానును, బ్రాహ్మణుండును, రథ+ఆరోహణంబు = తేరు నెక్కుటను, జేసి=ఒనర్చి (అనఁగా రథము నెక్కియనుట], ఏకరాత్రంబునన్ = ఒక రాత్రియందు, ఆవర్తకదేశంబులు = పడమటి కడలియొడ్డున ద్వారకాపట్టణమునకు సమీపమందుఁగల దేశములు, కడచి = అతిక్రమించి (దాటియనుట), విదర్భదేశమునకున్ = విదర్భయను రాజ్యమునకు, చనియెన్=వెళ్ళెను, అందున్ = ఆవిదర్భదేశమందు, కుండినపురి + ఈశ్వరుండు=కుండిన నగరరాజు ఐన భీష్మకుఁడు, కొడుకునకున్ = కుమారునకు, వశుండు + ఐ = లొంగిపోయినవాఁడై, కూఁతున్ = కుమార్తెను, శిశుపాలునకున్=శిశుపాలుఁడను రాజునకు, ఇచ్చునట్లు = ఇచ్చెదనని, తలఁచి=నిశ్చయించి, శోభన+ఉద్యోగంబులు = మంగళయత్నములు, చేయించెను = ఒనర్చెను, అప్పుడు=ఆ సమయమున,

సీ. రచ్చలు క్రంతలు ♦ రాజమార్గంబులు
విపణిదేశంబులు ♦ విశదములుగఁ

జేసిరి చందన ♦ సిక్తతోయంబులు
కలయంగఁ జల్లిరి ♦ కలువడములు
రమణీయ వివిధ తో ♦ రణములుగట్టిరి
సకలగృహంబులు ♦ సక్కఁజేసి
కర్పూర కుంకుమా ♦ గరు ధూపములు వెట్టి
రతివలు పురుషులు ♦ నన్నియెడల
ఆ. వివిధ వస్త్రములను ♦ వివిధ మాల్యాభర
ణానులేపనముల ♦ నమరియుండి
రఖిల వాద్యములు మ ♦ హా ప్రీతి మ్రోయించి
రుత్సవమున నగర ♦ మొప్పి యుండె. 41

టీ. రచ్చలు=సభామంటపములు, క్రంతలు=సందులు, రాజమార్గంబులు = పెద్దవీధులు, విపణిదేశంబులు=వాణిజ్య ప్రదేశములు (అనఁగా అంగడివీధులు), విశదములుగన్=నిర్మలముగా, చేసిరి, చందన=మంచి గంధముచే, సిక్త=కలుపబడిన, ఉదకములు=జలములు, కలయంగన్= ఎల్లతావులను, చల్లిరి=కలియంపిగాఁజిలికిరి, కలువడములు=కలువపూవు దండలను, రమణీయ = మనోహరములయిన, వివిధ = అనేకవిధములగు నాకులయొక్క, తోరణములున్ = తోరణములు, కట్టిరి, సకలగృహంబులు=ఎల్లయిండ్లను, చక్కజేసి=పరిశుభ్రముగా సవరించి, కర్పూర = కర్పూరము యొక్కయు, కుంకుమ = కుంకుమపూవుల యొక్కయు, అగరు=చెక్కల యొక్కయు, ధూపములు=పొగలు, పెట్టిరి=ఉంచిరి, అతివలు=సుందరీమణులు, పురుషులు = మగవారు, అన్నియెడలన్=ఎల్ల తావులను, వివిధ=అనేక విధములగు, వస్త్రములను=బట్టలచేతను, వివిధ= పలుతెఱఁగులగు, మాల్య=పుష్పమాలికలచేతను, ఆభరణ = అలంకారములచేతను (నగలు), అనులేపనములన్=గంధపుబూతలచేతను, అమరి= ఒప్పి, ఉండిరి, అఖిల = సమస్తవిధములయిన, వాద్యములు = మంగళ

వాద్యములు, మహత్ = ఎక్కువ, ప్రీతిన్ = ప్రియముతో, మ్రోయిం చిరి=వాయించిరి, ఉత్సవమునన్=సంతోషముచేత, నగరము=పట్టణము, ఒప్పియుండెన్ = తగియుండెను.

తా. అలంకరింపఁబడిన రాజమార్గములు సందులు మంటపములు గలదియు, మంచిగంధపునీటిచే గలయంపిఁజల్లబడిన వీధులుగలదియు, కర్పూర కుంకు మాగరు ధూపములు జేయఁబడినదియు, మంచి మంచి వస్త్రములం బూవుల సొమ్ములఁదాల్చినపురుషులచేఁబ్రకాశించునదియు, అనేకమంగళవాద్యములచేనొప్పునదియునై పట్టణము విరాజిల్లుచుండెను.

వ. అంత నా భీష్మకుండు విహిత ప్రకారంబులం బితృదేవ తల నర్చించి బ్రాహ్మణులకు భోజనంబులు పెట్టించి మంగళాశీర్వచనంబులు చదివించి రుక్మిణీదేవి నభిషిక్తం జేసి వస్త్రయుగళభూషితం గావించి రత్నభూషణంబు లిడంజేసి ఋగ్యజుస్సామ మంత్రంబుల మంగళాచారంబు లొనరించి భూసురులు రక్షాకరణంబు లాచరించిరి. పురోహితుండు గ్రహ శాంతి కొఱకు నిగమనిగదిత న్యాయంబున హోమంబుఁ గావించెను. మఱియు నా రాజదంపతుల మేలుకొఱకు తిల ధేను కలధౌత కనక చేలాది దానంబులు ధరణీ దేవతల కొసంగె నయ్యవస రంబున, 42

టీ. అంతన్=తర్వాత, ఆభీష్మకుండు, విహితప్రకారంబులన్= శాస్త్రపద్ధతులను, పితృదేవతలన్=నాందీముఖమందైన శ్రాద్ధదేవతలను, అర్చించి=పూజచేసి,బ్రాహ్మణులకున్,భోజనంబులు, పెట్టించి,మంగళ+ ఆశీర్వచనంబులు = శుభాశీర్వాదములు, చదివించి=పఠింపించి, రుక్మిణీ దేవిన్, అభిషిక్తన్ + చేసి = మంగళస్నానము కలదానినిగాఁ జేసి, వస్త్రయుగళ భూషితన్=వస్త్రద్వయముచే నలంకరింపఁబడిన దానిని,

గావించి=చేసి, రత్నభూషణంబులు = రత్నాభరణములను, ఇడంజేసి = పెట్టుకొనఁజేసి, ఋగ్యజుస్సామ మంత్రంబులన్ = ఋగ్వేదము యజుర్వేదము సామవేదము మొదలగు వానియందలి మంత్రములచేత, మంగళాచారంబులు = శుభంబులగు నడవడులను, ఒనరించి = చేసి, భూసురులు = భూమిదేవులు, (బ్రాహ్మణులు), రక్షాకరణంబులు = రక్షణకై సేయు పనులు, ఆచరించిరి = చేసిరి, పురోహితుఁడు = కులగురువు, గ్రహశాంతికొఱకున్ = నవగ్రహములయొక్క శాంతినిమిత్తము, నిగమనిగదిత = వేదమందుఁ జెప్పబడిన, హోమంబున్ = హోమమును, కావించెన్ = చేసెను, మఱియును, ఆరాజు = అభీష్మకుఁడు, దంపతుల మేలు కొఱకున్ = భార్యాభర్తల శుభమునకై, తిల = నువ్వులు, ధేను = గోవులు, కలధౌత = సువర్ణము, కనకచేల = బంగారు వస్త్రములు, ఆదిదానంబులు = మొదలయిన దానములను, ధరణీదేవతలకున్ = భూసురులకు, ఒసంగెన్ = ఇచ్చెను, ఆ + అవసరంబున = అట్టిసమయంబున,

మ. భట*సంఘంబులతో రథావళులతో ♦ భద్రేభయూ
ధంబుతోఁ। బటువేగాన్విత ఘోటకవ్రజముతో ♦ బంధు
ప్రియశ్రేణితోఁ। గటుసంరంభముతో విదర్భతనయం ♦
గైకొందునంచున్ విశంకటవృత్తింజను దెంచెఁ జైద్యుఁడు
గడుఁ ♦ గర్వించి యప్వీటికిన్. 43

టీ. చైద్యుఁడు = శిశుపాలుఁడు, భటసంఘంబులతోన్ = సేనాసముదాయముతో, రథ + ఆవళులతోన్ = రథసందోహములతో, భద్ర + ఇభయూథంబుతోన్ = భద్రగజబృందముతో, పటువేగ = ఎక్కువ చురుకుతో, అన్విత = కూడుకొనిన, ఘోటకవ్రజముతోన్ = గుఱ్ఱముల గుంపుతో, బంధు = చుట్టములయొక్కయు, ప్రియ = మిత్రుల

* ఈపద్యమునందు సంఘము, ఆవళి, సందోహము, యూథము, వ్రజము, శ్రేణి అని సమూహమునకుఁ బర్యాయపదములు కవివాఁడెను. కవిత్వములో నిదియొక యందము.

యొక్కయు, శ్రేణితోన్=సమూహముతో, కటు=తీక్ష్ణమైన, సంరంభములోన్=వేగముతో, విదర్భతనయన్ = రుక్మిణిని, కైకొందున్ = చేకొందును, అంచున్ = అని తలంచుచు, వికంకట = విస్తారమైన, వృత్తిన్=ఉద్యోగముతో (పనితో), కడున్=మిగుల, గర్వించి = గరువము గలవాఁడై, ఆ + పీటికిన్ = ఆ కుండిన నగరమునకు, చను దెంచెన్=ఏతెంచెను.

తా. శిశుపాలుఁడు సేనతోడను, బంధుమిత్రాదులతోడను గూడి రుక్మిణిం బెండ్లియాడుదునని గర్వముతో కుండినసగరమున కేతెంచెను.

ఉ. బంధులఁగూడి కృష్ణ♦బలభద్రులు వచ్చినబాఱఁదోలిని
ర్మంధరవృత్తిఁ జైద్యునకు ♦ మానినిగూర్చెఁద మంచు
నుల్లస, త్సింధురవీరవాజి రథ ♦ సేనలతోఁ జనుదెంచి
రాఁ*జరాసంధుఁడు దంతవక్త్రుఁడును ♦ సాల్వవిదూరక
పౌండ్రకాదులున్. 44

టీ. ఆ జరాసంధుఁడు,దంతవక్త్రుఁడు,సాల్వ,విదూరక,పౌండ్రక, ఆదులున్ = మొదలయినవారును, బంధులన్ = బంధువులను, కూడి = కలిసికొని, కృష్ణబలభద్రులు=కృష్ణుఁడును బలరాముఁడును, వచ్చినన్= వచ్చినప్పటికిని, పాఱఁదోలి=పరుగెత్తునట్లు, కొట్టి, నిర్ + మంథరవృత్తిన్=తడయనివ్యాపారముతో,చైద్యునకున్=శిశుపాలునకు,మానినిన్=

*జరాసంధుఁడు=మగధదేశపురాజు,ఉపరిచరవసువుకొడుకయిన బృహద్రథుని పుత్రుఁడు. వీనికొడుకు సహదేవుఁడు. గిరివ్రజపురనివాసి. బృహద్రథుఁడు తపస్సుచేయఁగా జండకౌశికునివలన వరమున నొక ఫలమునీయ బృహద్రథుని భార్యలిద్దఱు రెండు ముక్కలుగా తినుటవలన రెండు పీలికలుగా నిద్దఱుసుఁ బుట్టినవి. ఈతని యల్లుఁడు కంసుఁడు. కంసుని కృష్ణుఁడు చంపెనని జరాసంధుఁడు పదునెనిమిది సారులు దండెత్తెను. జరచే సంధింపబడినవాఁడు. దంతవక్త్రుఁడు వృద్ధశర్మునికి వసుదేవుని చెలియలైన శ్రుతదేవియందు పుట్టినకొడుకు. వీడును శిశుపాలుఁ

రుక్మిణిని, కూర్చెదము = భార్యగా నొనర్చెదము, అంచున్=అనుచు, ఉల్లసత్ = ప్రకాశించుచున్న, సింధుర = ఏనుగులతోను, వీర=వీరుల తోను, వాజి = గుఱ్ఱములతోను, రథ = రథములతోను, సేనలతోన్ = బలములతోను, చనుదెంచిరి = ఏతెంచిరి.

తా. చతురంగబలసేనాసమేతులై జరాసంధాదులు కృష్ణుఁడు మొదలగువారిఁదోలి రుక్మిణీదేవిని శిశుపాలునకుఁ బెండ్లిసేయుదమని వచ్చిరి.

వ. మఱియు నానాదేశంబుల రాజు లనేకు లేతెంచిరందు
శిశుపాలు నెదుర్కొని బూజించి భీష్మకుండొక్కనివేశం
బున నతని విడియించె నంతఁ దద్వృత్తాంతంబు విని, 45

టీ. మఱియు = ఇంకను, నానాదేశంబుల రాజులు=వివిధ దేశాధీశ్వరులు, అనేకులు = చాలమంది, ఏతెంచిరి, అందు = వారిలో, శిశుపాలున్=శిశుపాలుని, ఎదుర్కొని=ఎదురుకోలుమహోత్సవముజరిపి, పూజించి = గౌరవించి, భీష్మకుండు, ఒకనివేశంబునన్ = ఒక యింటి యందు, అతనిన్ = ఆశిశుపాలుని, విడియించెన్ = విడిదిగాఁ బ్రవేశ పెట్టెను, అంతన్ = అంతట, తత్+వృత్తాంతంబు = ఆ సమాచారమును, విని = ఆలించి,

---

డును సనకసనందుల శాపముచే అసురకృత్యములు కలవారుగాఁ బుట్టిన జయవిజయులు. వీఁడు కృష్ణునిచేఁ జంపఁబడెను. సాల్వుఁడు శిశుపాలుని తమ్ముఁడు. కృష్ణుఁడు శిశుపాలుని చంపెనను కోపమున శివునిగూర్చి తపముచేసి సకలమాయలను గల్పించుశక్తియు, ఆకాశమునఁజరించునట్టి సౌంబకమనువిమానమునుబడసియాదవులనుహింసించుచుండగా కృష్ణుఁడు దండెత్తిపోయి వీనిని సంహరించెను. విదూరథుఁడు = విదూరథుఁడను నామాంతరముగలవాఁడు,సురథునికొడుకు, పౌండ్రకుఁడు=పాండ్రదేశాధీశ్వరుఁడు, ఓఢ్రదేశమునకును,ఆంధ్రదేశమునందలి ఉత్తరభాగమునకును ప్రాచీననామము. దీనికిబలికొడుకైనపుండ్రునివలన నీనామముగలిగెను.

చ. హరియొకఁడేగినాఁడుమగ ♦ ధాదులుచైద్యహితానుసారులై
నరపతులెందఱేనిఁ జని ♦ నారు కుమారికఁదెచ్చుచోటసం
గరమగుఁ దోడుగావలయుఁ ♦ గంసవిరోధికినంచువేగతా
నరిగె హలాయుధుండు కమ♦లాక్షునిజాడననేకసేనతోన్.

టీ. హల + ఆయుధుండు = నాగలి యాయుధముగాఁగల బలరాముఁడు, హరి=కృష్ణుఁడు, ఒకఁడు=ఒంటిగా, ఏగినాఁడు = వెళ్ళెను, మగధ+ఆదులు=జరాసంధాదులు, నరపతులు=నృపాలురు, చైద్యహిత=శిశుపాలుని మైత్రిని, అనుసారులై=వెంబడించినవారై (పురస్కరించుకొని), ఎందఱేనిన్ = చాలమంది, చనినారు = వెళ్ళిరి, కుమారికన్=బాలికయగు రుక్మిణిని, తెచ్చుచోటన్=తీసుకొనివచ్చుస్థలమున, సంగరమగు = పోరుగలుగవచ్చును, కంసవిరోధికిన్ = కంసుని జయించిన కృష్ణునకు, తోడుకావలయున్=సాయపడవలయును, అంచు=అనుచు, వేగ, తాను, కమల+అక్షునిజాడన్ = పద్మనేత్రుఁడగు కృష్ణునిదారిని, అనేక = ఎక్కువయిన, సేనతోన్=సైన్యముతో, అరిగెను = వెళ్ళెను.

తా. బలరాముఁడు కృష్ణుఁడు వెళ్ళిన సమాచారము నాలించి యాతనికి సాయపడుటకై విదర్భకు సేనాసమేతుఁడై వెళ్ళెను.

క. ఆలోపల నేకతమున
నాలోల విశాలనయన ♦ యగు రుక్మిణి త
న్నాలోకలోచనుఁడు హరి
యాలోకము సేసి కదియఁ ♦ డని శంకితయై. 47

టీ. ఆలోపలన్ = ఆ సమయమందు, ఏకతమునన్ = ఒంటిగా, ఆలోల=మిక్కిలిచంచలములైన, విశాల=పెద్దవియగు, నయన=కన్నులు గలది, అగు, రుక్మిణి, తన్ను, ఆలోకలోచనుఁడు = జ్ఞానదృష్టిగల, హరి = కృష్ణుఁడు, ఆలోకముచేసి = దయతోఁగనుఁగొని, కదియఁడు=సమీపింపఁడు, అని శంకిత+ఐ = సంశయముకలదై.

తా. అట్టియెడ రుక్మిణి, నా యందు దయగలవాఁడై కృష్ణుండు రాఁడని సంశయించి (విరోధాభాసాలంకారము).

శా. లగ్నంబెల్లి వివాహముం గదిసె నే♦లా రాఁడు గోవిం
దుఁ డు। ద్విగ్నంబయ్యెడి మానసంబు వినెనో♦వృత్తాంత
మున్ బ్రాహ్మణుం। డగ్నిద్యోతనుఁ డేటికిం దడసెనో♦
యత్నంబు సిద్ధించునో। భగ్నంబై చనునో విరించికృత
మెబ్భంగిం బ్రవర్తించునో.　48

టీ. లగ్నంబు=సుముహూర్తము, ఎల్లి=రేపు, వివాహమున్ = పెండ్లియును, కదిసెన్ = చేరువయ్యెను, గోవిందుఁడు=శ్రీకృష్ణుఁడు, ఏలరాఁడు=ఏకారణమున రాకుండెను? మానసంబు = (నా) చిత్తము, ఉద్విగ్నంబు=భీతితోఁగూడినది, అయ్యెడిన్ = అగుచున్నది, వృత్తాంతమున్ = (ఈ) సమాచారమును, వినెను+ఓ=విన్నాఁడో? (వినెనో లేదోయనుట), అగ్నిద్యోతనుఁడు = అగ్నిద్యోతనుఁడను నామముగల విప్రుఁడు, ఏటికిన్ = ఏకారణమున, తడసెన్ + ఓ = ఆలసించెనో, యత్నంబు = (నా) ప్రయత్నము, సిద్ధించున్+ఓ=సానుకూలమగునో, భగ్నంబు = చెడినదై, చనున్ + ఓ = పోవునో, విరించికృతము = బ్రహ్మచే నొనర్పబడినది (అనగా బ్రహ్మవ్రాసిన వ్రాలనుట), ఎబ్భంగిన్ = ఏవిధముగా, ప్రవర్తించున్+ఓ=జరుగనున్నదో.

తా. వివాహంబాసన్నమయ్యె, కృష్ణుఁడింకను రాకుండె. నేను పంపిన బ్రాహ్మణుండచ్చటికేఁగెనో లేదో! దైవమెట్లు సేయనున్నాఁడో?

మ. ఘనుఁ డాభూసురుఁ డేగెనో నడుమ మార్గ♦శ్రాంతుఁడై
చిక్కెనో। విని కృష్ణుం డిది తప్పుగాఁ దలఁచెనో ♦ విచ్చే
యునో యీశ్వరుం। డనుకూలింప దలంచునో తలఁపఁడో♦
యార్యామహాదేవియున్। ననురక్షింప నెఱుంగునో యె
ఱుఁగదో ♦ నాభాగ్య మెట్లున్నదో.　49

టీ. ఘనుఁడు = గొప్పవాఁడు. ఆ భూసురుఁడు = ఆ బ్రాహ్మణుఁడు, ఏగెన్+ఓ=వెళ్ళెనో, మార్గశ్రాంతుఁడు + ఐ = దారియందాయాసముపడినవాఁడై, నడుమన్ = మార్గమధ్యమున, చిక్కెన్ + ఓ=చిక్కుకొనెనో, ఇది=ఈవృత్తాంతము, విని = ఆలించి, కృష్ణుఁడు, తప్పగాన్ = తప్పుపనిగా, తలఁచెన్+ఓ = ఎంచెనో, విచ్చేయున్+ఓ=వచ్చునో, ఈశ్వరుండు=భగవంతుఁడయినశివుఁడు, అనుకూలింపన్=అనుకూలము చేయుటకు, తలంచున్ + ఓ = ఎంచునో, తలఁపడు + ఓ = ఎంచడో, ఆర్యామహాదేవియున్ = పార్వతీదేవియు, నన్ను, రక్షింపన్=పోషింప, ఎఱుంగున్+ఓ=ఎఱుఁగునో, ఎఱుంగదు+ఓ = ఎఱుఁగదో, నాభాగ్యము = నాయదృష్టము, ఎట్లు + ఉన్నది + ఓ = ఎట్లున్నదో ?

తా. సులభము.

వ. అని వితర్కించుచు, 50

టీ. అని = ఈవిధముగా, వితర్కించుచు=ఎంచుచు.

ఉ. పోఁడను బ్రాహ్మణుండు యదు ♦ పుంగవు వీటికి వాసు
దేవుఁడుఁ, రాఁడను నింక బోయి హరి ♦ రమ్మని జేరెడు
యిష్టబంధుఁడుఁ, లేడను రుక్మికిం దగవు ♦ లేదిటఁ
జైద్యున కిత్తునంచు ను, న్నాఁడను గౌరి కీశ్వరికి ♦ నా
వలనం గృపలేదు నేఁ డనుఁ. 51

టీ. బ్రాహ్మణుండు=పాఱుఁడు, యదుపుంగవు=యాదవోత్తముని యొక్క,వీటికిన్=నగరమునకు(ద్వారకకు),పోఁడు=వెళ్ళఁడు,అనుఁ=అనును, ఇంకన్=ఇఁకను,పోయి, వెళ్ళిరమ్మని, అని, చీరెడు=పిలిచెడి,ఇష్టబంధుఁడున్=ప్రియమైనచుట్టము, లేఁడు, అనున్=అనును, రుక్మికిన్=నాయన్నకు,తగవు=ధర్మము, లేదు, అటన్=ఇందు, చైద్యునకున్=శిశుపాలునకు, ఇత్తుఁ=ఇచ్చెదను, అంచుఁ=అనుచు, ఉన్నాఁడు = ఉండెను.

అనుచ్=అనుచు, ఈశ్వరికిక్=శివుని భార్యయగు గౌరికి (పార్వతీదేవికి), నావలనన్=నాయెడ, నేడు=ఇప్పుడు, కృప=కరుణ, లేదు, అనున్=అనును

తా. బ్రాహ్మణుఁడు వెళ్ళియుండఁడు, కృష్ణుఁడును రాకుండెను. తిరుగ వెళ్ళి పిలుచుకొనివచ్చు ప్రియబంధువొక్కఁడును గాన్పింపఁడు. శిశుపాలునకు నన్ను పెండ్లిచేయుదునని నాయన్న ప్రయత్నించుట ధర్మము కాదు, నాయెడలఁ బార్వతీదేవి కీసమయమున దయ లేకుండెననును.

ఉ. చెప్పదు తల్లికిం దలఁపుఁ ♦ జిక్కుదిశల్ దరహాసచంద్రికం
గప్పదు వక్త్ర తామరస ♦ గంధసమాగతభృంగసంఘముక్
రొప్పదు నిద్రఁ గైకొనదు ♦ రోజపరస్పర సక్తహారముల్
విప్పదు కృష్ణమార్గగత ♦ వీక్షణపంక్తులఁ ద్రిప్పదెప్పుడున్.

టీ. తలఁపుజిక్కు=తనమనోవేదనను, తల్లికిన్=జననికిఁగూఁడ, చెప్పదు=తెలియఁజేయదు, దరహాసచంద్రికన్=మందహాసమను వెన్నెల చేత, దిశల్=దిక్కులను, కప్పదు=వ్యాపింపఁజేయదు, వక్త్రతామరస=ముఖపద్మముయొక్క, గంధ=పరిమళమునకు. సమాగత = ఏతెంచిన, భృంగ=తేటులయొక్క, సంఘమున్=గుంపును, రొప్పదు = తోలుకొనదు, నిద్రన్, కైకొనదు=పోదు, ఉరోజ = పాలిండ్లనడుమ, పరస్పర=ఒకదానితోనొకటి, సక్త=కలిసికొనిన (అనగా జిక్కుపడిన), హారముల్=దండలను, విప్పదు = విడఁదీసికొనదు, కృష్ణమార్గగత = కృష్ణునిమార్గమును జెందిన, వీక్షణపంక్తులు = చూపులవరుసలు, ఎప్పుడున్ = ఏవేళను, త్రిప్పదు = మరలజేయదు.

తా. తన మనోభిప్రాయమును తల్లికిని దెలుపదు. మందహాసము సేయదు, ముఖపద్మమున మూఁగిన తుమ్మెదలను దోలుకొనదు. నిద్రింపదు, మెడలోఁజిక్కుపడిన హారములను సర్దుకొనదు. ఎల్లప్పుడును శ్రీకృష్ణుని రాకకై వేచియుండెను.

చ. తుడువదు కన్నులన్ వెడలు ♦ తోయకణంబులు కొప్పుఁజ
క్కఁగా, ముడువదు నెచ్చెలింగదిసి ♦ ముచ్చటకుం జనదన్న

మేమియుం, గుడువదు నీరముం గొనదు ♦ గూరిమిం గీరముం
జేరి పద్యమున్, నొడువదు వల్లకీగుణవి ♦ నోదము సేయదు
డాయ దన్యులన్. 53

టీ. కన్నులన్=నేత్రములనుండి, వెడలు=స్రవించునట్టి, తోయ కణంబులు=ఉదక బిందువులను, తుడువదు=తుడుచుకొనదు, కొప్పున్ = కొప్పును, చక్కఁగాన్=అందముగా, ముడువదు = ముడుచుకొనదు, నెచ్చెలిన్=ప్రియసఖిని, కదిసి=సమీపించి, ముచ్చటకున్=ముచ్చటించుటకు, చనదు=వెళ్ళదు, అన్నము, ఏమియున్ ఎంతమాత్రమును, కుడువదు=భుజింపదు, నీరమున్ = జలమును, కొనదు = పుచ్చుకొనదు (అనఁగా పానము చేయదనుట), కూరిమిన్=అనురాగముతో, కీరమున్=చిలుకను, జేరి=సమీపించి, పద్యమున్=శ్లోకమును, నుడువదు=పలుకదు (అనఁగా జెప్పదనుట), వల్లకీగుణ=వీణియతీగెలను మీటునట్టి, వినోదము=ఆనంద క్రీడను, సేయదు=సలుపదు, అన్యులన్=పరులను, డాయదు=దగ్గరిల్లదు,

తా. కన్నీటిం దుడువదు, కొప్పును ముడువదు, సఖులతో ముచ్చటింపదు, అన్నముండినదు, నీరు గ్రోలదు, చిలుకకుఁ బద్యముం జెప్పదు, వీణియమీటదు, అన్యులకడకుం జనకుండును.

సీ. మృగనాభి యలఁదదు ♦ *మృగరాజమధ్యమ
జలకంబులాడదు ♦ జలజగంధి

---

* ఈ పద్యమున, మృగరాజమధ్యమ కనుక మృగనాభియలమకొన కున్నను, ముకురసన్నిభముఖియగుట ముకురంబు చూడకున్నను, వనజాతలోచనయగుట వనకేళి గోరకున్నను, లతికాలలితదేహమగుటచే లతలఁబోషింపకున్నను, తొడవె తొడువుగాన తొడవులుతొడవకున్నను, తిలకినీతిలకమగుట తిలకమిడకున్నను, కమలహస్తయగుటచే గమలగృహము చొరకున్నను, రుక్మిణికి లోపము లేదనియు, నవి ధరించుటవలనఁ గ్రొత్తసౌందర్యము రానేరదనియుఁ గవి యభిప్రాయము.

ముకురంబు సూడదు ♦ ముకురసన్నిభముఖి
పువ్వులు దుఱుమదు ♦ పువ్వుఁబోడి
*వనకేళిఁ గోరదు ♦ వనజాతలోచన
హంసంబుఁ బెంపదు ♦ హంసగమన
లతలఁ బోషింపదు ♦ లతికాలలితదేహ
తొడవులు తొడువదు ♦ తొడవుతొడవు
ఆ. తిలక మిడదు నుదుటఁ ♦ దిలకినీ తిలకంబు
కమలగృహముఁ జొరదు ♦ కమలహస్త
గారవించి తన్నుఁ గరుణఁ ♦ గైకొన వన
మాలి రాఁడు తగవు ♦ మాలియనుచు. 54

టీ. వనమాలి=వనమాలికను దాల్చిన కృష్ణుఁడు, తన్నున్=తనను, గారవించి=మర్యాదచేసి, కరుణన్ = కృపతో, కైకొనన్ = చేకొనను (పాణిగ్రహణము చేయుటకని సూచన), తగవు=ధర్మము, మాలి=వదలి, రాఁడు, అనుచున్=అంచు, మృగరాజమధ్యమ=సింహముయొక్క నడుమువంటి నడుముగలరుక్మిణి, మృగనాభి=కస్తూరిని, అలఁదదు=పూసికొనదు, జలజగంధి = పద్మముల పరిమళమువంటి పరిమళముగల రుక్మిణి, జలకములన్ + ఆడదు=స్నానముచేయదు, ముకురసన్నిభ=అద్దముతో సమమగు, ముఖి=ముఖముగల రుక్మిణి, ముకురంబున్=అద్దమును, చూడదు, పువ్వుఁబోడి=పుష్పమువంటి శరీరముగల రుక్మిణి (సుకుమారశరీరిణి యనుట), పువ్వులు=పుష్పములను, తుఱుమదు=ముడుచుకొనదు, వనజాతలోచన=పద్మములవంటి నేత్రములుగల రుక్మిణి, వనకేళిన్ = వనవిహారమును, కోరదు=ఆశింపదు, హంసగమన=అంచలయొక్క నడకలవంటి నడకలుగల రుక్మిణి, హంసంబున్ = అంచను, పెంపదు = పోషింపదు, లతికాలలితదేహ = తీగవలె మనోహరమగు శరీరముగల రుక్మిణి, లతలన్ =

* వన మనఁగా ఉదకము, అడవి.

తీఁగలను, పోషింపదు=సంరక్షింపదు, తొడవుతొడవు=భూషణమునకు భూషణమయి యొప్పునాపె, తొడవు = అలంకారములను, తొడవదు=ధరియింపదు, తిలకినీ తిలకంబు = ముత్తయిదువులయందు శ్రేష్ఠురాలగు, రుక్మిణీదేవి, నుదుటన్ = నొసట, తిలకము = బొట్టు, ఇడదు = పెట్టుకొనదు, కమలహస్త = పద్మములవంటి హస్తములుగల రుక్మిణి, కమలగృహమున్ = కొలఁకును, చొరదు = ప్రవేశింపదు.

తా. కృష్ణుఁడు రాకున్న కారణమున రుక్మిణి విచారమునఁ దాను కస్తూరి మొదలయిన ద్రవ్యములను స్వీకరించుట లేదు.

వ. మఱియును, 55

టీ. మఱియును = ఇంతియుగాక,

మ. మలఁగున్ మెల్లనిగాలికిన్ బటునట♦న్మత్తద్విరేఫాళికిం
దలఁగుం గోయిలమ్రోఁతకై యలఁగును♦ద్యత్కీరసంభాషలం
గలఁగున్ వెన్నెలవేఁడిమిన్నలగుమా♦కందాంకురచ్ఛాయకుం
దొలఁగుం గొమ్మమనోభవానలశిఖా♦దోదూయమానాంగియై.

టీ. కొమ్మ=రుక్మిణి, మనోభవ = చిత్తదుఁడను (మన్మథుఁడను), అనల=వహ్నియొక్క, శిఖా=జ్వాలలచేత (మంటలచేత), దోదూయమాన=మిగులఁ దహింపఁబడఁజేయుచున్న, అంగియై = ఒడలు కలదియై, మెల్లనిగాలికిన్ = మందమారుతమునకు, మలఁగున్ = విముఖియగును, పటు = అందముగా, నటత్ = నాట్యముచేయు, మత్త = మదించిన, ద్విరేఫ+ఆళికిన్ = తుమ్మెదలపంక్తికి, తలఁగున్ = తొలఁగిపోవును, కోయిల మ్రోఁతకున్+ఐ=కోవెలధ్వనికై, అలఁగున్=కోపముజెందును, ఉద్యత్=బయలుదేఱుచున్న, కీరసంభాషలన్ = శుకముల మాటలచేత, (చిలుకపలుకులచేత), కలఁగున్=కలఁతనొందును, వెన్నెలవేఁడిమిన్= చంద్రునియొక్క కాఁకకు, నలఁగున్=నలిగిపోవును, మాకంద+అంకుర చ్ఛాయకున్=తీయమామిడి మొక్కలనీడకు, తొలఁగున్=తొలంగును.

తా. రుక్మిణీదేవి విరహపరితాపమును సహింపలేక మందమారుతమునకు విముఖియగును. తుమ్మెదల నాదమును విననొల్లదు. కోయిలకూతలకుఁ గష్టము జెందును. చిలుకల పలుకుల కులుకు జెందును. వెన్నెలకాఁకకుఁ దేకువవీడును. రసాలముల నీడకుఁ గోడుజెందును.

వ. ఇట్లు హరిరాక కెదురుసూచుచు సకలప్రయోజనంబులందును విరక్తయై మనోజానలంబులం బొగిలెడి మగువకు శుభంబు చెప్పుచందంబున వామలోచనభుజంబు లదిరె నంతఁ గృష్ణు నియోగంబున బ్రాహ్మణుండు సనుదెంచిన నతని ముఖలక్షణం బుపలక్షించియాకలకంఠకంఠి మహోత్కంఠతోడ నకుంఠితయై మొగంబునఁ జిఱునగవు నిగుడ నెదురుసని నిలువంబడిన బ్రాహ్మణుండిట్లనియె. 57

టీ. ఇట్లు=ఈవిధముగా, హరిరాకకున్ = కృష్ణునియాగమనమునకు, యెదురుసూచుచున్=ముందు కాంచుచు, సకలప్రయోజనంబులందును = ఎల్లపనులయందును, విరక్తయై = ఆసక్తిలేనిదై, మనోజ + అనలంబున = మదనాగ్నిచేత, పొగిలెడిమగువకు = వేధింపఁబడు రుక్మిణికి, శుభంబున్ = మేలును, చెప్పుచందంబునన్= తెలుపుకీతిని, వామలోచన భుజంబులు=ఎడమనేత్రము, ఎడమభుజము, అదరెన్ = చలించె (స్త్రీలకు ఎడమభాగమున నున్న అవయవములును, పురుషులకు కుడిభాగముననున్న యవయవములు జలించుట మంగళప్రదమును సూచించునని శాస్త్రము), అంతన్ = అంతట, కృష్ణనియోగంబునన్ =శ్రీకృష్ణని యాజ్ఞచే, బ్రాహ్మణుండు, సనుదెంచినన్=రాఁగా, ఆతని =ఆబ్రాహ్మణునియొక్క, ముఖలక్షణంబు=మోమునంగల చిహ్నము, ఉపలక్షించి=చూచి, ఆ కలకంఠకంఠి=అవ్యక్తమధురమగుధ్వనితోఁగూడినకుత్తుకగల రుక్మిణి, మహత్ + ఉత్కంఠతోడన్ = గొప్ప (యిష్టవస్తుప్రాప్తియందలి) వేగిరపాటుతో, అకుంఠితయై=నిబ్బరముగలదియై, మొగంబునన్=ముఖమున, చిఱునగవు = మందహాసము, నిగుడన్ = ఉప్పొం

గఁగా, ఎదురసని=బ్రాహ్మణున కెదురేఁగి, నిలువఁబడినన్ = నిలిచి యుండగా, బ్రాహ్మణుండు, ఇట్లు, అనియెన్=పలికెను.

ఉ. మెచ్చెభవద్గుణోన్నతి క♦మేయధనావళులిచ్చెనాకుఁ దా
వచ్చె*సుదర్శనాయుధుఁడు♦వాఁడెసురాసురులెల్ల నడ్డమై
వచ్చిననైన రాక్షస వి♦వాహమునం గొనిపోవునిన్ను నీ
సచ్చరితంబుభాగ్యమును♦సర్వము నేఁడుఫలించెగన్యకా.

టీ. కన్యకా=రుక్మిణీ! (వివాహము కోరుచున్నదానయని భావము), భవత్ = నీయొక్క, గుణ+ఉన్నతికిన్ = అధికమయిన గుణములకు (మంచిగుణముల కనుట), మెచ్చె=సంతసించెను, నాకున్=నాకు, అమేయ+ధన+అవళులు = ఎన్నశక్యముగాని ద్రవ్యసముదాయములను, ఇచ్చెన్=ఒసంగెను, సుదర్శన+ఆయుధుఁడు = చక్రాయుధుఁడయిన, కృష్ణుఁడు (సుదర్శనాయుధుఁడనుట జయసూచకము), తాన్ = తాను, వచ్చెన్=వచ్చెను, వాఁడు+ఎ=అడుగో, సుర+అసురులు=దేవదానవులు, ఎల్లన్ = అందఱును, అడ్డమువచ్చినన్+ఐనన్ = అడ్డుకొనినప్పటికిని, రాక్షస వివాహమునన్ = ఎత్తుకొనిపోయి చేసుకొను వివాహవిధిని, నిన్నున్=నిన్ను, కొనిపోవును=తీసికొనిపోవును, నీసత్+చరితంబున్=

* సుదర్శనము=సుదర్శనమను పేరుగల చక్రము, సు=యోగ్యమయిన, దర్శనము=చూపు, ఆయుధుఁడు = ఆయుధము గాఁగలవాఁడు, మఱియు, సు=యోగ్యమయిన, దర్శన=ధర్మమే, ఆయుధుఁడు=ఆయుధము గాఁ గలవాఁడు, "ధర్మోజయతి" అనునట్లు ధర్మమే జయసాధనము గా గలవాఁడనుట, దర్శనము=చూపు, కన్ను, అద్దము, బుద్ధి, తెలివి, శాస్త్రము, ధర్మము అని యర్థములు కలది. ఈ పద్యమునందుఁ గవి 'కన్యకా' అను సంబోధన చివర నందముగాఁ బెట్టినను "వచ్చెసుదర్శనాయుధుఁడు"అని మొదలుపెట్టినచో వ్యాకులపడుచున్న రుక్మిణికిఎక్కువ సంతోషమునుగలుగఁజేసినవాఁడగును. అట్లయినను "మెచ్చె భవద్గుణోన్నతికి"అనికొంత సంతోషముగలిగించెను గాని తరువాత "అమేయ

నీయోగ్యమగు చారిత్రమును, భాగ్యమును, అదృష్టమును, సర్వమున్ = సమస్తమును (అంతయుననుట), నేఁడు = ఇప్పుడు, ఫలించెన్=ఫలమునకు వచ్చెను.

తా. నీ మంచిగుణములకు మెచ్చి అదుగో శ్రీకృష్ణుఁడు వచ్చియున్నాఁడు, నీకోరికదీర నేఁడే నిన్నుఁ గొనిపోవును.

వ. అనిన వైదర్భి యిట్లనియె, 59

టీ. అనిన=ఇట్లనగా, వైదర్భి=విదర్భరాజు కూఁతురగు రుక్మిణి, ఇట్లు+అనియె = తిరుగ నిట్లు పలికెను.

మ. జలజాతేక్షణుఁ దోడితెచ్చితివి నా♦సందేశముంజెప్పినన్
నిలువంబెట్టితినీకృపన్ బ్రతికితిన్ ♦ నీయట్టిపుణ్యాత్మకుల్
కలరే దీనికి నీకుఁ బ్రత్యుపకృతిం ♦ గావింపఁగా నేర నం
జలిఁగావించెదభూసురాన్వయమణీ♦సద్బంధుచింతామణీ.

టీ. భూసుర+అన్వయమణీ=విప్రకులరత్నమా! సత్ + బంధుచింతామణీ=సత్పురుషుల యొక్కయు,బంధువులయొక్కయుఁగోర్కెలనుదీర్చువాఁడా, జలజాత+ఈక్షణున్=పద్మములవంటి నేత్రములుగల కృష్ణుని, నాసందేశమున్=నా వృత్తాంతమును చెప్పి,తోడితెచ్చితివి = వెంటఁబెట్టుకొనివచ్చితివి(తీసికొనివచ్చితివనుట),నన్=నన్నునిలువన్+

---

ధనావళులిచ్చెనాకు" అని తనవిషయమును వెంటనే చెప్పుకొనెను. ఇదియంతయు రుక్మిణికి సంతోషదాయకముకానేరదు. మూడవపాదమున 'రాక్షసవివాహమునన్ గొనిపోవు నిన్ను' అనునంతవఱకు నేమగునోయని సందేహమే పెట్టియున్నాఁడు. ఇది లేఖక ప్రమాదముగు నేమోయని తలంతును. ఏమనఁగా నెంతమాత్రము మార్పులేకుండ "వచ్చెసుదర్శనాయుధుఁడు వాఁడె సురాసురులెల్ల నడ్డమై।వచ్చిననైన రాక్షసవివాహమునన్ గొనిపోవు నిన్ను నీ। సచ్చరితంబు భాగ్యమును సర్వము నేఁడుఫలించెగన్యకా। మెచ్చె భవద్గుణోన్నతి కమేయ ధనావళు లిచ్చె నాకుఁ దాన్" అనిన సరిపోవును.

పెట్టితివి=ప్రాణములతో నిలిపితివి, నీకృపన్=నీయనుగ్రహముచేత, బ్రతికితిన్ = జీవించితిని, నీ+అట్టి = నినుఁబోలిన, పుణ్య+ఆత్మకుల్ =ధర్మస్వభావులు, కలరే=ఉన్నారా (మఱియొకరు లేరు), దీనికిన్=ఈయుపకృతికి (ఈయుపకారమునకనుట), నీకున్ = నీకు, ప్రత్యుపకృతిన్=మారుపకారమును, కావింపన్ + కాన్ = ఒనర్చుటకు, నేరన్ = చాలను, అంజలిన్=నమస్కారమును, కావించెదన్ = చేసెదను.

తా. విప్రోత్తమా! నావృత్తాంతమును దెలియఁజేసి కృష్ణునివెంట నిడికొని దెచ్చి నాప్రాణములు నిల్పిన నీకుఁ బ్రత్యుపకృతి నమస్కారమునకన్న నేమియుఁజేయ నేరను.

వ. అనినమస్కరించె నంత రామకృష్ణులు దన కూఁతు వివాహంబునకు వచ్చుట విని దూర్యఘోషణంబులతో నెదుర్కొని విధ్యుక్తప్రకారంబునంబూజించి మధుపర్కంబు లిచ్చివివిధాంబరాభరణంబులు మొదలైనకానుకలొసంగి భీష్మకుండు బంధుజనసేనాసమేతులైన వారలకుఁదూర్ణంబున సకల సంపత్పరిపూర్ణంబులైన నివేశంబులు గల్పించి విడియించెనిట్లుకూడినరాజులకెల్లనువయోవీర్యబలవిత్తంబులెట్లట్ల కోరిన పదార్థంబులెల్ల నిప్పించి పూజించె నంత విదర్భపురంబుప్రజలు హరిరాక వినివచ్చిచూచి నేత్రాంజలులం దదీయవదనకమలమధుపానంబు సేయుచు, 61

టీ. అని=ఇట్లుచెప్పి, నమస్కరించెన్ = వందనమాచరించెను, అంతన్=అంతట, రామకృష్ణులు, తన కూఁతువివాహంబునకున్=తన కుమార్తె పెండ్లికి, వచ్చుటన్=వచ్చినవారని, విని=తెలిసికొని, తూర్యఘోషణంబులతోన్=(మంగళ)వాయిద్యధ్వనులతో, ఎదుర్కొని=ఎదురేఁగి, విధి+ఉక్తప్రకారంబునన్ = శాస్త్రమునందు నుడివిన విధమున, పూజించి=గౌరవించి(అర్ఘ్యపాద్యాదివిధులచేసనుట) మధుపర్కంబులు

-పెరుగునఁగలిపిన తేనెలు, ఇచ్చి = ఒసఁగి, వివిధ = పలువిధములయిన, అంబర=వస్త్రములు, ఆభరణంబులు=వస్తువులు(మొదలయిన) కానుకలు= కట్నములను, ఒసఁగి-ఇచ్చి, భీష్మకుండు, బంధుజన = చుట్టములతో, సేన=సైన్యములతో, సమేతులు=కూడికొనినవారు, ఐనవారలకు = ఐన ట్టివారికి, తూర్ణంబ=వేగముగా, సకల=సమస్తమయిన, సంపత్=భాగ్య ములతో, పరిపూర్ణంబులు=నిండినవి, అయిన నివేశంబులు = అయినట్టి యిండ్లు, కల్పించి=ఏర్పాటుచేసి, విడియించెన్=ప్రవేశపెట్టెను, ఇట్లు= ఈవిధముగా, కూడిన రాజులన్ = కలసిన నృపాలురను, ఎల్లను = అందఱిని, వయోవీర్యబల విత్తంబులు=వయస్సు, శౌర్యము, సేనలు, ద్రవ్యములు, ఎట్లు=ఏవిధమో, అట్లు=అవిధమే, కోరిన ప్రకారంబులు= వారివారికిఁగావలసినవస్తువులు, ఎల్లన్=అన్నియు, ఇప్పించి = పొంద జేసి, పూజించెన్=గౌరవించెను, అంత=అంతట, విదర్భపురంబు ప్రజలు= కుండిన పురములోని జనులు, హరిరాకన్=కృష్ణునివచ్చుటను, విని = ఆలకించి, వచ్చి=వచ్చినవారై, చూచి=కనుఁగొని, నేత్ర+అంజలు లన్=లోచనము లనెడు దోయిళ్ళచే, తదీయ=ఆ కృష్ణసంబంధమైన, వదనకమల=మోమనెడు పద్మమునందలి, మధుపానంబున్=తేనెయొక్క త్రావుటను, చేయుచు=ఒనరించుచు, (కృష్ణునిఆనందముగాజూచుచు ననుట) రూపకాలంకారము.

మ. తగుఁనీచక్రి విదర్భ రాజసుతకుం♦దథ్యంబు వైదర్భియుం
దగునీ చక్రికి నింత మంచిదగు నే♦దాంపత్య మీయిద్దఱిం
దగులంగట్టిన బ్రహ్మ నేర్పరిగదా ♦ దర్పాహతారాతియై
మగఁడౌగావుతజక్రియీరమణికిన్ ♦మాపుణ్యమూలంబునన్

టీ. ఈచక్రి = కృష్ణుఁడు, విదర్భరాజసుతకున్ = భీష్మకుని కుమార్తెయగు రుక్మిణికి, తగున్=తగును, తథ్యంబు = నిజము, వైదర్భి యున్=రుక్మిణియు, ఈచక్రికిన్ = ఈకృష్ణునకు, తగున్ = ఒప్పును, దాంపత్యము = భార్యాభర్తలభావము, ఇంతమంచిది+అగును+ఏ =

ఎక్కడనింతకన్నమంచిది యుండునా! (ఉండదనుట), ఈఇద్దఱిన్ = ఈయిరువురిని, తగులన్=కూడియుండునట్లు, కట్టినబ్రహ్మ=ఏర్పఱచిన విధాత, నేర్పరి=సామర్థ్యము కలవాఁడుకదా! (అగును), చక్రి = కృష్ణుఁడు, దర్ప+అహత + అరాతియై = శౌర్యముచేఁ గొట్టబడిన విరోధులు కలవాఁడై, ఈరమణికిన్=ఈరుక్మిణికి, మాపుణ్యమూలంబునన్=మే మొనరించిన సుకృతముఁజేతనైనను, మగఁడు=భర్త, అగున్+కావుతన్=అగుగాక.

తా. విదర్భలోని ప్రజలు కృష్ణుని రుక్మిణినిఁ గాంచి వీరిద్దఱికిని పెండ్లియగునట్లు దైవ మనుగ్రహించుగాక యని వేఁడుకొనిరి. (సమానాలంకారము).

వ. అనియిట్లుపలికి రాసమయంబున. 63

టీ. అని, ఇట్లు=ఈవిధముగా, పలికిరి=వచించిరి. ఆసమయంబునన్ = ఆకాలమందు.

సీ. సన్నద్ధులైబహు ♦ శస్త్రసమేతులై
బలసి చుట్టును వీర ♦ భటులు గొలువ
ముందఱ నుపహార ♦ ములు గానుకలుఁగొంచు
వర్గంబులై వార ♦ వనిత లేఁగ
బుష్పగంధాంబర ♦ భూషణకలితలై
పాడుచు భూసుర ♦ భార్యలరుగఁ
బణవమర్దళ శంఖ ♦ పటహకాహళవేణు
భేరీధ్వనుల మిన్ను ♦ పిక్కటిలఁగఁ
ఆ. దగిలి సఖులుగొలువఁ ♦ దల్లులు బాంధవ
సతులుఁ దోడ రాఁగ ♦ సవినయమున
నగరు వెడలి నడచె ♦ నగజాతకును మ్రొక్క
బాల చికుర పిహిత ♦ ఫాలయగుచు. 64

టీ. వీరభటులు = శౌర్యముతోఁగూడిన బంట్లు, సన్నద్ధులు + ఐ = సిద్ధపడినవారై, బహుశస్త్రసమేతులై = పలువిధములగు ఆయుధములను ధరించినవారై, చుట్టును = అన్నిప్రక్కలను, బలసి = చుట్టుకొని, కొలువన్ = సేవింపఁగా, వారవనితలు = వారకాంతలు, ముందఱన్ = ముందుభాగమున, ఉపహారములు = ఉపాయనములు, కానుకలు = కట్నములు, కొంచున్ = పట్టుకొని, వర్గంబులై = ప్రోగులై, ఏఁగన్ = వెళ్ళఁగా, భూసురభార్యలు = బ్రాహ్మణస్త్రీలు, పుష్పగంధ + అంబర. భూషణకలితలు + ఐ = పూలతోను, గంధముతోను, బట్టలతోడను, నగలతోను గూడినవారై, పాడుచున్ = పాడుచు, అరుగన్ = వెళ్ళఁగా, పణవ = హుడుక్కముల యొక్క (వాద్యవిశేషణము) మర్దళ = మృదంగముల యొక్కయు (మద్దెలలయొక్కయు), శంఖ = శంఖములయొక్కయు, పటహ = తప్పెటలయొక్క, కాహళ = బాకాలయొక్కయు, వేణు = పిల్లనగ్రోవులయొక్కయు, భేరీ = నగారాలయొక్కయు, ధ్వనులన్ = నాదములచేత, మిన్ను = ఆకాశము, పిక్కటిలఁగన్ = విరివిగాఁగా, తగిలి = వెంబడించి, సఖులు = నేస్తకత్తెలు, కొలువన్ = సేవింపఁగా, తల్లులు = జననులు, బాంధవ సతులు = చుట్టములైన యాఁడువాండ్రు, తోడరాఁగన్ = వెనువెంటరాఁగా, సవినయమునన్ = వినయముతో, నగరు వెడలి = పురము విడిచి, బాల = రుక్మిణి, చికురముంగురులచే, పిహిత = ఆవరింపఁబడిన, ఫాల = నుదురుగలది, అగుచున్, నగజాతకును = గౌరీదేవికి, మ్రొక్కన్ = నమస్కరించుటకు (అనగా మ్రొక్కు చెల్లించుకొనుటకు), నడచెన్ = వెళ్ళెను.

తా. భటులు రెండువైపులనడువ, వారకాంతలు పూజాద్రవ్యములు పట్టుకొని ముందు నడువ, దల్లులు చెలికత్తెలును బంధుసరాండ్రు విప్రాంగనలు కూడరాఁగా గౌరీదేవికి మ్రొక్కుఁ జెల్లించుకొన పురము విడిచి రుక్మిణి వెళ్ళెను.

వ. మఱియు సూత మాగధవందిగాయక పాఠకజనులంతంత నభినందించుచుం జనుదేర మందగమనంబున ముకుంద

చరణారవిందంబులు డెందంబునఁ దలంచుచు నిందుధర సుందరీ మందిరంబుఁ జేరి సలిల ధారాధౌతకర చరణార విందయై వార్చి శుచియై గౌరీసమీపమునకుం జనియె నంత ముత్తైదువలగు భూసురోత్తముల భార్యలు భవ సహితయైన భవానికి మజ్జనంబుఁగావించి గంధాక్షతంబు లిడి వస్త్రమాల్య భూషణాదుల నలంకరించి ధూప దీపంబు లొసంగి నానావిధోపహారంబులు సమర్పించి కానుక లిచ్చి దీపమాలికల నివాళించి రుక్మిణీదేవిని మ్రొక్కించిరప్పుడు. 65

టీ. మఱియు = ఇంతియుగాక, సూత=బట్టువాండ్రు, మాగధ= కులప్రమాగత చారిత్రమునుజదువువాండ్రు, వంది=శౌర్యాదులంబొగడు వాండ్రు, గాయక=సంగీతముపాడువారు, పాఠకజనులు=పురాణములు చదువువారు, అంతంతన్ = అందందు, అభినందించుచున్ = స్తోత్రము సేయుచు, చనుదేరన్ = రాఁగా, మందగమనంబునన్ = మెల్లనగునడకతో, ముకుంద=కృష్ణునియొక్క, చరణ+అరవిందంబులు=పాదపద్మములను, డెందంబునన్=చిత్తమునందు, తలంచుచున్=ధ్యానముచేయుచు, ఇందుధర=చంద్రుఁడే కిరీటముగాఁగల యీశ్వరుని, సుందరీ = భార్యయగుగౌరియొక్క, మందిరంబున్ = ఆలయమును (అనఁగా దుర్గాదేవి గుడిని), చేరి = ప్రవేశించి, సలిలధార = ఉదకముచేత, ధౌత = కడుగబడిన, కరచరణ + అరవిందయై=పద్మములవంటి హస్తములును చరణములును గలదియై, వార్చి = ఆచమనించి, శుచియై = పవిత్రయై (అనఁగా శుద్ధితోనఁనుట), గౌరీ సమీపంబునకున్ = పార్వతిదగ్గఱకు, చనియెన్ = వెళ్ళెను, అంత = ఆటుపిమ్మట, ముత్తైదువులు + అగు = పుణ్యాంగనలైన, భూసుర+ఉత్తముల భార్యలు=మంచి బ్రాహ్మణుల కాంతలు (బ్రాహ్మణస్త్రీలు), భవసహిత=ఈశ్వరునితోఁగూడినది, ఐన

భవానికిన్ = అయిన పార్వతికి, మజ్జనంబు = అభిషేకమును, కావించి = చేసి, గంధ + అక్షతంబులు = గంధమును అక్షతలును, ఇడి = ఇచ్చి, వస్త్ర = వస్త్రములు, మాల్య = పూలమాలికలు, భూషణ + అనులన్ = అలంకారములు మొదలగువానిచే, అలంకరించి, ధూపదీపంబులు = అగరు ధూపములు దీపములును, ఒసంగి = పెట్టి, నానావిధ + ఉపహారంబులు = అనేక విధములైన నైవేద్య పదార్థములను, సమర్పించి = బాగుగా నొసంగి, కానుకలు = పూజాద్రవ్యములను, ఇచ్చి, దీపమాలికలన్ = దీపపంక్తులచే (ముందుంచిన దీపము అవసరమనియు, పిమ్మట నుంచిన దీపములు మహాదీపారాధన యనియు భావము), నివాళించి = హారతు లొసంగి, రుక్మిణీదేవిని, మ్రొక్కించిరి = మ్రొక్కునట్లు చేసిరి, అప్పుడు = ఆ సమయమందు,

ఉ. నమ్మితినా మనంబునస ♦ నాతనులైన యుమామహేశులన్
మిమ్ముఁబురాణదంపతుల ♦ మేలుభజింతుఁ గదమ్మ మేటి పె
ద్దమ్మదయాంబురాశివిగ ♦ దమ్మహరిం బతిసేయుమమ్మనిన్
నమ్మినవారికెన్నఁటికి ♦ నాశము లేదుగదమ్మ యీశ్వరీ!

టీ. ఈశ్వరీ = పార్వతీ ! సనాతనులు = ఎల్లప్పుడునుండువారు, ఐన పురాణదంపతులన్ = చిరకాలమునుండియున్న భార్యాభర్తలను, ఉమామహేశ్వరులన్ = గౌరీశంకరులను, మిమ్మున్ = మిమ్ము, నా మనంబునన్ = నాచిత్తమునందు, నమ్మితిన్ = నమ్మియుంటిని, మేలు = మంచివిధిని, భజింతున్ = కొలిచెదను, దయా + అంబురాసి = దయయను సముద్రమువంటి దానవు (అనగా విస్తారము దయకలదానవనుట), కద + అమ్మ = అగుదువుగదా, తల్లీ! హరిన్ = శ్రీకృష్ణుని, పతిన్ = భర్తను, చేయుము = ఒనరించుము, అమ్మ = తల్లీ, నిన్ = నిన్ను, నమ్మినవారికిన్ = నమ్మినట్టివారికి, ఎన్నఁటికిన్ = ఎప్పటికిని, నాశము = కీడు, లేదు + కదమ్మ = లేదుగదా తల్లీ ! (ఎన్నటికిని లేదనుట.)

తా. పురాణదంపతులను నాశరహితులగు మిమ్ముం గొలిచిన నాకు శ్రీకృష్ణుని భర్తగా నొనర్చి నా యభిలాషను దీర్పుము.

వ. అని గౌరీదేవికి మ్రొక్కి పతులతోడం గూడిన బ్రాహ్మణ
భార్యలకు లవణాపూపంబులును దాంబూల కంఠ
సూత్రంబులును ఫలంబులు నిక్షుదండంబులు నిచ్చి
రుక్మిణీదేవి వారలం బూజించిన, 67

టీ. అని, గౌరీదేవికి=దుర్గాదేవికి, మ్రొక్కి=వందనమాచరించి, పతులతోడన్ = భర్తలతో, కూడిన = కలిసియున్న, బ్రాహ్మణ భార్యలకున్=విప్రాంగనలకు, (దంపతులకనుట), లవణ+అపూపంబులును = ఉప్పును అప్పంబులును, తాంబూల = తాంబూలములును, కంఠసూత్రంబులును = మంగళసూత్రంబులును, ఫలంబులు = పండ్లును, ఇక్షుదండంబులును = చెఱకుగడ్డలును, ఇచ్చి = ఒసఁగి, రుక్మిణీదేవి, వారలన్ = ఆబ్రాహ్మణదంపతులను, పూజించినన్=పూజలు సేయఁగా, (పురాణదంపతులయిన పార్వతీపరమేశ్వరులం బూజించి, తరువాత బ్రాహ్మణదంపతులను బూజించెను.)

ఆ. వార లుత్సహించి ♦ వలనొప్ప దీవించి
సేస లిడిరి యువతి ♦ శిరమునందు
సేసలెల్ల దాల్చి ♦ శివవల్లభకు మ్రొక్కి
మౌననియతిమాని ♦ మగువ వెడలె. 68

టీ. వారలు = ఆ బ్రాహ్మణదంపతులు, ఉత్సహించి=సంతోషమును జెంది, వలను+ఒప్పన్=నేర్పరితనముతో, దీవించి=ఆశీర్వదించి, సేసలు=మంత్రాక్షతలను, యువతిశిరంబునందు=రుక్మిణిదలపై, ఇడిరి = చల్లిరి, సేసలు=దీవనబ్రాలు (అనఁగాదీవించునిమిత్తముంచినయక్షతలు) ఎల్లన్=అన్నియు, తాల్చి=శిరసునవహించి, మగువ=రుక్మిణి, శివవల్లభకున్=శివునిభార్యయగు పార్వతికి, మ్రొక్కి=నమస్కరించి, మౌననియతిన్ = మౌనవ్రతమును, (అనఁగా బలుకకుండుటను), మాని = వదలి, వెడలెన్ = మఱలెను.

తా. ఆ బ్రాహ్మణ దంపతులు రుక్మిణీదేవిచేసిన పూజకు సంతోషించి యాశీర్వదింప నాయాశీర్వాదంబులఁగైకొని రుక్మిణి పార్వతికి మ్రొక్కి మౌనవ్రతమును మాని గృహమునకేఁగ బయలుదేఱెను.

వ. ఇట్లు మేఘమధ్యంబు వెలువడి వికసించు క్రొక్కాఱు మెఱుంగు తెఱంగున మృగధరమండలంబు నిర్గమించిచరించు మృగంబుచందంబునఁ గమలభవ నర్తకుండెత్తిన జవనిక మఱుఁగు దెరలి పొడసూపిన మోహినీదేవత కైవడి దేవదానవ సంఘాత కరతల సవ్యాపసవ్య సమాకృష్యమాణ పన్నగేంద్రపాశ పరివలయిత పర్యాయ పరిభ్రాంత మంథరాచల మంథాన మథ్యమాన ఘూర్ణిత ఘుమఘుమాయితమహార్ణవ మధ్యంబుననుండి చనుదెంచునిందిరాసుందరీ వైభవంబున బహువిధ ప్రభాభాసమానమై యిందుధరసుందరీ మందిరంబు వెలువడి మానస కాసార హేమ కమలకానన విహరమాణ మత్తమరాళంబుభంగి మంద గమనంబునఁ గనక కలశయుగళ సంకాశ కర్కశ పయోధర భారపరికంప్యమాన మధ్యమై రత్నముద్రికాలంకృతంబైన కెంగేలనొక్క సఖిలలామంబు కైదండ గొని రత్ననివహ సమంచితకాంచన కర్ణ పత్త్రిమయూఖంబులు గండభాగంబుల నర్తనంబులు సలుప నరవింద పరిమళ కుతూహలావతీర్ణమత్త మధుకరంబుల మాడ్కి నరాళంబులైన కుంతలజాలంబులు ముఖమండలంబునం గ్రందుకొన సుందర మందహాస రోచులు దిశలందు బాలచంద్రికా సౌందర్యంబు నావ

హింప నదరబింబఫలారుణ మరీచి మాలికలు రదనకుంద కుట్మలంబుల కనురాగంబుసంపాదింప మనోజాత కేతన సన్నిభంబైన పయ్యెదకొంగుదూఁగ సువర్ణ మేఖలాఘటిత మణికిరణ పటలంబు లకాలశక్రచాపజనకంబులై మెఱయ జఱుకువిలుతుండొఱవెఱికి వాఁడిచుడి ఝళిపించిన ధగద్ధగాయమానంబులగు బాణంబులపగిది సురుచిరవిలోకన నికరంబులు రాజవీరుల హృదయంబులు భేదింప శింజాన మంజుమంజీరనినదంబులు సెవులపండువులు సేయఁ బాద సంచారంబున హరిరాక కెదురు చూచుచు వీగమోహిని యై చనుదెంచుచున్న సమయంబున, 69

టీ. ఇట్లు=ఈవిధముగా, మేఘమధ్యంబునన్=మబ్బునడుమనుండి, వెలువడి=బయలుదేఱి, విలసించు = ప్రకాశించునట్టి, ప్రాక్కాలరు = వర్షకాలసంబంధమైన, మెరుంగుతెఱంగునన్ = మెఱుపువలె, మృగధరమండలంబున్ = చంద్రమండలమునుండి, నిర్గమించి= బయలువెడలి, చరించు = సంచరించు, మృగంబుచందంబునన్ = జింకవలె, కమలభవ=బ్రహ్మయను, నర్తకుండు = నటుఁడు, ఎత్తిన=పట్టుకొనిన, జవనిక మఱుఁగు = తెరచాటునుండి, తెరలి=బయల్పడి, పొడసూపిన = అగుపడిన, మోహినీదేవతకైవడిన్ = మోహినీదేవతవలె, దేవ=దేవతల యొక్కయు, దానవ=రాక్షసులయొక్కయు, సంఘాత=సముదాయము యొక్క, కరతల = హస్తములచేత, సవ్య+అపసవ్య = కుడి యెడమ ప్రక్కలను, సమ్+ఆకృష్యమాన = లాగబడుచున్న, పన్నగ+ఇంద్ర పాశ=ఆదిశేషువను త్రాటిచేత, పరివలయిత=లెస్సగాఁజుట్టబడినదియు, పర్యాయ=వరుసగా,పరిభ్రాంత=తిరుగుచున్నదియునగు,మందర+అచల = మందరపర్వతమనెడు, మంథాన = కవ్వముచేత, మథ్యమాన = తరచబడుచున్నదియు (అనఁగాఁజిలుకుట), ఘూర్ణిత = సుడులుదిరుగు

-చున్న. ఘుమఘుమాయిత = ఘుం ఘుం అని ధ్వనిచేయుచున్న, మహా ర్ణవ=గొప్పకడలియొక్క, మధ్యంబుననుండి=మధ్యభాగమునుండి, చను దెంచు = ఏతెంచుచున్న, ఇందిరాసుందరీ వైభవంబునన్ = లక్ష్మీదేవి చందంబున, బహువిధ = అనేక విధములగు, ప్రభా = కాంతులచే, భాసమాన + ఐ = ప్రకాశించునదియై, ఇందుధర = సుందరీమందిరం బునన్ = శివునిభార్యయగు పార్వతీదేవి ఆలయమునుండి, మానసకా సార = మానససరోవరమునందలి, హేమకమల = బంగారు తామరల యొక్క, కానన=వనమందు, విహారమాణ=సంచరించుచున్న, మత్త = మత్తిల్లిన, మరాళంబు భంగిన్ = అంచరీతిని, మందగమనంబునన్ = మెల్లనగు నడకతో, కనకకలశయుగళ = బంగారు కుండలముయొక్క జతతో, సంకాశ=సరియైన, కర్కశ = కాఠిన్యముగల, పయోధర భార = స్తనభారముచేత, పరికంప్యమాన = మిక్కిలి యల్లలనాడు చున్న, మధ్యయై = నడుముగలదియై, రత్నముద్రికా = రత్నాంగు ళీయకముచే, అలంకృతంబు = అలంకరింపబడినది, అయిన=అయినట్టి, కెంగేలన్=ఎఱ్ఱనిచేతితో, ఒక్కసఖీలలామంబు=ఒక నేస్తకత్తెయొక్క, కైదండ = చేయూతను, కొని = తీసికొని, రత్న = మణులయొక్క, నివహ = సముదాయముచేత, సమంచిత = మిక్కిలియొప్పుచున్న, కాంచన=బంగారుయొక్క, కర్ణపత్రము=కమ్మలయొక్క (కర్ణపుష్ప ములనుట), మయూఖంబులు = కాంతులు, గండ భాగంబునన్ = చెక్కులయందు, నర్తనంబులు = నృత్యములు, సలుపన్ = చేయఁగా (కర్ణపుష్పకాంతులుగండస్థలమునఁ బ్రసరించెననుట), అరవింద=పద్మ ములయొక్క, పరిమళ = సువాసనయందలి, కుతూహల=ఆసక్తిచేత, అవతీర్ణ=దిగిన, వ్రాలిన, మత్త=మదించిన, మధుకరంబులమాడ్కిన్ = తేంట్లవలె, అరాళంబులు = కుటిలములు (వంకరలు), అయిన కుంతల జాలంబులు = అయినట్టి వెంట్రుకలసముదాయములు (ముంగురులు), ముఖమండలంబునన్ = సుంద్రదనగుముఖమునందు, క్రిందుకొనన్ = వ్యాపింపఁగా, సుందర మందహాసరోచులు = అందమగు చిఱునవ్వు యొక్క కాంతులు, దిశలందున్ = దిక్కులు, బాల చంద్రికా = లేత

వెన్నెలలయొక్క, సౌందర్యంబుల = అందమును, ఆవహింపఁగ = పుట్టింపఁగా, అధరబింబఫల+అరుణమరీచి మాలికలు = దొండపండు బోలిన పెదవియొక్క రక్తవర్ణముల పంక్తులును, రదనకుందకుట్మలంబులన్=మల్లెమొగ్గలంబోలు దంతములను, అనురాగంబునన్=రక్తిమమును, సంపాదింపన్=పుట్టింపఁగా, మనోజాత=మదనునియొక్క, కేతన = టెక్కెముతో (ధ్వజముతో) సన్నిభంబు=సమానము, అయిన పయ్యెద కొంగు=అయినట్టి పయఁటచెంగు, తూఁగన్=ఆడఁగా, సువర్ణ మేఖలా = బంగారపు ఒడ్డాణము కొంతియందు, ఘటిత=కూర్పఁబడిన, మణి = మణులయొక్క, కిరణ=కాంతులయొక్క, పటలంబులు = సముదాయములు, అకాల=కాలముగాని కాలమందు, శక్రచాప=ఇంద్రధనుస్సును, జనకంబులు+ఐ=పుట్టించునవియై, మెఱయన్ = వెలుఁగఁగా, చెఱకు విల్తుఁడు = చెఱకువిల్లుగాఁగల మన్మథుఁడు, ఒఱ = కోశమునుండి (గవుసెనుండి), వెఱికి=తీసి, వాఁడియిడి=పదనుపెట్టి, ఝళిపించినన్= ఆడింపఁగా, ధగద్ధగాయ మానంబులు = ధగధగ మెఱయునవి, అగు బాణంబుల పగిదిన్ = అయినట్టి శరములవలె, సురుచిర = మిక్కిలి ప్రకాశించు, విలోకన = చూపులయొక్క, నికరంబులు = సమూహములు, రాజుల హృదయంబులన్ = నృపాలురయొక్క మనస్సులను, భేదింపన్ = బ్రద్దలుచేయఁగా, శింజాన, = మ్రోగుచున్న, మంజు = మృదులములైన, మంజు+ఈర=మనోహర ధ్వనిగల, యందెలచప్పుడులును, చెవులపండువులు = కర్ణపర్వములు, చేయన్ = చేయఁగా, పాదసంచారంబునన్ = కాలినడకతో, హరి రాకకున్ = కృష్ణుని వచ్చుటకు, ఎదురుచూచుచున్=వేచుకొని వీక్షించుచు, వీరమోహిని+ఐ = శూరులను మోహమున ముంచునదియై, చనుదెంచుచుఉన్న = వచ్చుచున్న, సమయంబునన్ = వేళయందు.

మ. అలినీలాలకఁబూర్ణ చంద్రముఖినే ♦ ణాక్షిం *బ్రవాళా
ధరం, కలకంఠిన్ నవపల్లవాంఘ్రియుగళం ♦

*ప్రవాళము=పగడము, చిగురు.

గంధేభకుంభ స్తనిం, బులినశ్రోణి నిభేంద్రయానన, నరుణాం ♦ భోజాతహస్తన్ మహోత్పలగంధిన్ మృగరాజమధ్య గని
వి ♦ భ్రాంతాత్ములై రందఱున్. 70

టీ. అలినీల+అలకన్ = తుమ్మెదలవంటి నల్లనైన ముంగురులు గల దానిని, పూర్ణచంద్రముఖిన్ = రాకాచంద్రుని బోలిన ముఖము గల దానిని, ఏణ+అక్షిన్ = లేడికన్నులవంటి కన్నులు గలదానిని, ప్రవాళ+అధరన్ = పగడమువంటి ఎఱ్ఱనయిన ఓష్ఠము కలదానిని, కల కంఠిన్ = మనోహరమగు కుత్తుక కలదానిని, నవపల్లవ+అంఘ్రి యుగళన్ = నూత్నపూగములను బోలిన (చిగురుంబోలిన) పాదద్వయము కలదానిని, గంధ+ఇభకుంభ స్తనిన్=మత్తగజము యొక్క కుంభస్థలము వంటి పాలిండ్లు గలదానిని, పులిన శ్రోణిన్ = ఇసుక తిన్నెల వంటి జఘనములు (పిరుదులు) కలదానిని, ఇభేంద్ర+యానన్=మంచిఏనుఁగు యొక్క నడకవంటి నడక కలదానిని, అరుణ+అంభోజాతహస్తన్ = రక్తపద్మములవంటి (ఎఱ్ఱతామరల వంటి) కరములు కల దానిని, మహత్+ఉత్పలగంధిన్ = ఉత్తమమయిన కలువయొక్క పరిమళము వంటి శరీర సువాసన కలదానిని, మృగరాజ మధ్యన్ = పంచాస్యము (సింహము)యొక్క నడుమువంటి నడుము కలదానిని, కని=వీక్షించి, అందఱున్ = ఎల్లవారును, విభ్రాంత + ఆత్ములు = భ్రాంతిఁ జెందిన చిత్తముగలవారు, ఐరి=అయిరి.

తా. సకల సౌందర్యవతియగు రుక్మిణీదేవిని చూచినవారందఱును భ్రాంతిం జెందినవారైరి.

---

69. రుక్మిణిదుర్గాలయమునుండి బయలుదేఱినవిషయము చెప్పుటలో రుక్మిణివర్ణనముతో నీచవచనమును రసవంతముగా కవి కల్పించి యున్నాఁడు. ఆరంభించినది మొదలు తుదివరకు స్వభావవర్ణనారూపమైన యుపమాలంకారములతో ఛందోనిబద్ధముకాని లోపమును దీర్చి తన వైదగ్ధ్యమును వెల్లడించె ననుటకు సందియములేదు.

వ. మఱియు నయ్యింతి దరహాస లజ్జావలోకనంబులఁ జిత్తంబు లేమఱి ధైర్యంబు దిగనాడి గాంభీర్యంబులు విడిచి గౌరవంబులుమఱచి చేష్టలుమాని యెఱుకలుడిగి యాయుధంబులు దిగవైచి గజతురగరథారోహణంబులు సేయనేరక రాజులెల్ల నేలకు వ్రాలి రా యేణీలోచన తన వామకరనఖంబుల నలకంబులుదలంగం ద్రోయుచు నుత్తరీయంబుల చక్కనొత్తుచుఁ గడకంటి చూపులం గ్రమంబున నా రాజలోకంబు నాలోకించుచు, 71

టీ. మఱియున్=ఇంక, ఆ+ఇంతి=ఆరుక్మిణియొక్క, దరహాస=మందహాసముతోడి, లజ్జా = వ్రీడ (సిగ్గు) తో గూడిన, అవలోకనంబులన్=చూడ్కులచేత, చిత్తంబులు=మనస్సులు, ఏమఱి = జాగ్రత్తను వీడి, ధైర్యంబులు=ధీరత్వములను, దిగనాడి=వదలి, గాంభీర్యంబులు = గంభీరత్వములను, విడిచి = త్యజించి, గౌరవంబులు = మర్యాదలను, మఱచి=ఎఱుకనుండి త్రోసివైచి, చేష్టలు=చేతలను (పనులను), మాని, ఎఱుకలు=జ్ఞానములు, ఉడిగి=విడిచి, ఆ యుధంబులు=శస్త్రాస్త్రములను (కత్తులు బాణములు మొదలైనవానిని), దిగవైచి = క్రిందబడవైచి, గజ=ఏనుఁగుల యొక్కయు, తురగ = గుఱ్ఱముల యొక్కయు, రథ = స్యందనముల యొక్కయు (తేరులయొక్క), ఆరోహణంబులు = ఎక్కుటలను, చేయనేరక = ఒనర్పఁజాలక, రాజులు+ఎల్లన్=అందఱు రాజులును, నేలకున్ వ్రాలిరి = భూమిపైనొఱగిరి, ఆ యేణీలోచన = ఆ లేడికన్నులవంటి కన్నులుగల రుక్మిణి, తన=తనయొక్క, వామకరనఖంబులన్=ఎడమచేతిగోళ్ళచేత, అలకంబులు = ముంగురులును, తలంగన్=తొలఁగునట్లు, త్రోయుచున్=త్రోయుచు, (ఎడమచేతిగోళ్ళతో ముంగురులను సవరించుట స్వభావోక్తి), ఉత్తరీయంబున్ = పయఁట కొంగును, చక్కన్= సరిగా, ఒత్తుచున్=దిద్దుకొనుచు (సవరించుకొనుచు) (ఇదియు స్వభావోక్తి) ఆ రాజలోకంబులన్ = ఆనృపాలుర

సందోహమును, కడకంటి చూపులన్ = అపాంగ వీక్షణములచే, (ముందు పద్యముతో నన్వయము).

మ. కనియెన్ రుక్మిణిచంద్రమండలముఖుం♦గంఠీరవేంద్రావల
గ్నునవాంభోజదళాక్షుఁజారుతరవ♦క్షున్ మేఘసంకాశదే
హునగారాతిగజేంద్రహస్తనిభబా♦హుంజక్రిఁబీతాంబరున్
ఘనభూషాన్వితుఁ గంబుకంఠు విజయో♦త్కంఠున్ జగ
న్మోహనున్. 72

టీ. చంద్రమండలముఖున్ = ఇందుబింబమువంటి ముఖముగల వానిని, కంఠీరవ + ఇంద్ర + అవలగ్నున్ = ఉత్తమమయిన సింగము నడుమువంటి నడుముగలవానిని, నవ+అంభోజదళ+అక్షున్ = నూతనమగు పద్మములయొక్క రేకులవంటి నేత్రములుగలవానిని, చారుతర = మిగులసౌందర్యముతోఁగూడిన,వక్షున్=హృదయము(ఱొమ్ము)గలవానిని మేఘ=మబ్బుతో, సంకాశ=తుల్యమయిన(సరియైన), దేహున్ = శరీరకాంతిగలవానిని, ♦ నగ=పర్వతములకు, అరాతి=విరోధియగు నింద్రుని యొక్క, గజేంద్ర=శ్రేష్ఠమగు నేనుఁగు, (ఐరావతము) యొక్క, హస్త నిభ = కరము (తొండము) వంటి, బాహున్=హస్తములు కలవానిని, చక్రి = చక్రాయుధముగలవానిని, పీత+అంబరున్ = పచ్చని బట్టలు కలవానిని (కనకచేలుఁడనుట), ఘనభూష+అన్వితున్ = విలువయైన నగలతోడఁగూడినవానిని, (అనఁగా నగలు ధరించినవాఁడనుట), కంబు కంఠున్=శంఖముంబోలిన గళముకలవానిని, విజయ+ఉత్కంఠున్ = జయముగోరువానిని, జగత్+మోహనున్ = ప్రపంచమును మోహింపఁజేయువానిని (కృష్ణుని). రుక్మిణి=రుక్మిణీదేవి, కనియెన్=వీక్షించెను.

తా. రుక్మిణి లోకములను మోహింపఁజేయు చక్కని యందము గల కృష్ణుని గనుఁగొనెను.

---

♦ నగము = పర్వతము, వృక్షము.

వ. కనితదీయరూపవయోలావణ్యవైభవగాంభీర్యచాతుర్య తేజోవిశేషంబులకు సంతసించి మనోభవశరాక్రాంత యై రథారోహణంబుఁ గోరుచున్న వరారోహంజూచి పరిపంథి రాజలోకంబులు సూచుచుండ మందగమనంబున గంధసింధురంబులీలం జనుదెంచి ఫేరవంబులనడిమిభాగంబుఁగొని చను కంఠీరవంబుకైవడినిఖిలభూపాలగణంబుల గణింపక తృణీకరించి రాజకన్యకం దెచ్చి హరితనరథంబుమీఁద నిడుకొని భూనభోంతరాళంబులు నిండ శంఖంబు పూరించుచు*బలభద్రుండు తోడనడువ యాదవవాహినీ పరివృతుండై ద్వారకానగరమార్గంబుఁబట్టి చనియె నంత జరాసంధ వశులయిన రాజు లందఱు హరి పరాక్రమంబు విని సహింపనోపక.

టీ. కని=అట్లుచూచినదై, తదీయ=ఆకృష్ణునియొక్క, రూప = సౌందర్యముయొక్కయు, వయః = వయస్సుయొక్కయు, లావణ్య=ముఖకాంతివిశేషముయొక్కయు, వైభవ= భాగ్యముయొక్కయు, గాంభీర్య = గంభీరముయొక్కయు, చాతుర్య= నేర్పరితనముయొక్కయు, తేజః= శౌర్యముయొక్కయు, విశేషంబులన్ = అతిశయములకు, సంతసించి = ఆనందించి, మనోభవ=మన్మథునియొక్క, శర=సాయకములచే, (బాణ

*బలభద్రుఁడు=బలరాముఁడు. ఆదిశేషునియంశమున వసుదేవునకు రోహిణియందుఁ బుట్టిన కొడుకు. ఇతఁడు మొదట దేవకి గర్భమునందు చేరి యోగమాయచే ఆమెగర్భమునుండి సంకర్షింపగా రోహిణి గర్భమునం జేరి పిదప అవతరించెను. కనుకనే యతనికి సంకర్షణుఁడు అనియు నామము కలదు. ఇతనికి కాలకేతుఁడు, నీలాంబరుఁడు, హలాయుధుఁడు, రేవతీరమణుఁడు, కృష్ణాగ్రజుఁడు అనియు నామములు.

ములచే), ఆక్రాంతయై=పరివేష్టింపబడినదై (చుట్టబడినదై),రథ+ఆరోహణంబున్ = తేరునెక్కుటను, కోరుచున్న=వేడుచున్న (అపేక్షించుచున్న).వర+ఆరోహన్=చక్కనిపిరుదులుగలదానిని,చూచి=వీక్షించి, పరిపంథిరాజలోకములు = వైరిరాజసముదాయములు, చూచుచున్ = కనుఁగొనుచు, ఉండన్ = ఉండఁగా, మందగమనంబునన్ = మెల్లని నడకతో, గంధసింధురంబులీలన్ = మదించిన యేనుఁగువలె, చను దెంచి=ఏతెంచి, ఫేరవంబుల నడిమి భాగంబునన్ = నక్కలగుంపు మధ్యభాగమును (నక్కలను), కొనిచను = తీసికొనిపోవు, కంఠీరవంబు కైవడిన్ = సింగమువలె. నిఖిల = సమస్తమయిన, భూపాలగణంబులన్ = రాజసముదాయములను, గణింపక = లెక్కసేయక, తృణీకరించి = గడ్డిపోచఁగాజూచి, (లక్ష్యపెట్టక) రాజకన్యకన్ = రుక్మిణిని, తెచ్చి = కొనితెచ్చి, హరి = కృష్ణుఁడు, తనరథంబుమీఁదన్ = తన తేరిపై, ఇడికొని=పెట్టుకొని, భూ = భూమియొక్కయు, నభః = ఆకాశము యొక్కయు, అంతరాళంబులు = మధ్యప్రదేశంబులు, నిండన్=నిండునట్లు, శంఖంబు=శంఖమును, పూరించుచున్=ఊదుచు, బలభద్రుఁడు = బలరాముఁడు, తోడునడువన్ = వెనువెంటరాగా, యాదవవాహినీ పరివృతుండు+ఐ = యాదవసేనతోఁ బరివేష్టింపబడినవాఁడై, ద్వారకానగరమార్గమునన్=ద్వారకాపురము దారిని, పట్టి = చేకొని, చనియెన్ = వెళ్ళెను, అంత = తరువాత, జరాసంధవశులు = జరాసంధునికి అధీనులు, అయిన రాజులు = అయిన నృపాలురు, అందఱు = ఎల్లరు, హరిపరాక్రమంబునన్ = కృష్ణుని శౌర్యమును, విని = ఆలకించి, సహింపనోపక = సహింపలేక.

మ. ఘన సింహంబుల కీర్తి నీచమృగముల్ ♦ గైకొన్నచందం
బునన్, మనకీర్తుల్ గొని బాలఁ దోడ్కొనుచు ను ♦
న్నాదంబుతో గోపకుల్, చనుచున్నారదె శౌర్యమెన్నఁ
టికి మీ ♦ శస్త్రాస్త్రముల్ గాల్పనే; తనుమధ్యన్ విడి
పింపమేని నగరే ♦ ధాత్రీజనుల్ క్రంతలన్. 74

టీ. ఘనసింహంబులకీర్తి = పెద్దసింగముల యశస్సు, నీచమృగములే = అల్పమగు జంతువులు, కైకొన్నచందంబునన్ = తాల్చినవిధముగా, మనకీర్తుల్ = మనఖ్యాతులను, కొని = అపహరించి, బాలన్ = రుక్మిణిని, తోడ్కొనుచున్ = తీసికొనుచు, ఉన్మాదంబుతోన్ = మత్తతతో, గోపకుల్ = గొల్లలు, అదె = అదుగో, చనుచున్నారు = వెళ్ళుచున్నారు, శౌర్యము = శూరత్వము, ఎన్నఁటికిన్ = ఎప్పటికిని (ఇంక నెన్నఁటికిని), మీశస్త్రఅస్త్రముల్ = మీయొక్క ఖడ్గములును, బాణములును, కొల్పన్ + ఎ = తగుల బెట్టనా ? తనుమధ్యన్ = సన్నని నడుము గల రుక్మిణిని, విడిపింపము + ఏనిన్ = వదలింపనియెడల, ధాత్రీజనుల్ = భూమిమీఁదనున్న ప్రజలు, క్రంతలన్ = సందుసందులఁ జేరి, నగరు + ఏ = పరిహాసము చేయరా ? ఉపమాలంకారము.

తా. అల్పజంతువులు సింహముయొక్క కీర్తిని బొందునట్లు, గొల్లవాండ్రు మనయశస్సును హరించి రుక్మిణీదేవిం దీసికొని పోవుచున్నారు. మనమూరకుండినయెడలఁ బ్రజలు మనలజూచి నవ్వుదురు.

వ. అని యొండొరులం దెలుపుకొని రోషంబులు హృదయంబులనిలుపుకొని సంరంభించి తనుత్రాణంబులు వహించి ధనురాది సాధనంబులు ధరియించి పంతంబు లాడి తమ తమ చతురంగ బలంబులంగూడి జరాసంధాదులు యదువీరుల వెంటనంటం దాఁకి నిలునిలుండని ధిక్కరించి పలికి యుక్కు మిగిలి మహీధరంబులమీఁద సలిలధారలు గురియు ధారాధరంబుల చందంబున బాణవర్షంబులు గురిసిన యాదవసేనలం గల దండనాయకులు కోదండంబు లెక్కిడి గుణంబులు మ్రోయించి నిలువంబడిరప్పుడు. 75

టీ. అని = ఇట్లు చెప్పుకొని, ఒండొరులన్ = ఒకరినొకరు, తెలుపుకొని = తెలియఁ జెప్పుకొని, రోషంబులు = క్రోధంబులు (కోపంబులు), హృదయంబులన్ = చిత్తములయందు, నిలుపుకొని = పెట్టుకొని,

పరంభించి = విజృంభించి, తనుత్రాణంబులన్ = కవచములను, వహించి = తాల్చి, ధను+ఆదిసాధనంబులు = విల్లుమున్నగు నాయుధములను, ధరించి=తాల్చి, పంతంబులు+ఆడి=ప్రతిజ్ఞలుచేసి, తమతమ చతురంగబలంబులన్=వారి వారి రథగజ తురగపదాతులతో గూడిన సేనలను, కూడి=చేరి, జరాసంధ+ఆదులు = జరాసంధుఁడు మున్నగువారు, యదువీరులవెంటన్ = శూరులైన యాదవుల వెంబడి, అంటన్= కలియునట్లు, తాఁకి=ఎదురుకొని, నిలునిలుండు=నిలువుఁడు నిలువుఁడు (అనగా బాతిపోకుఁడు, బాతిపోకుఁడు అనుట), అని, ధిక్కరించి = తిరస్కరించి, పలికి, ఉక్కుమిగిలి=బలమతిశయింపగా, మహీధరంబుల మీఁదన్= పర్వతములపైన, సలిలధారలు = నీటిధారలను, కురియు = వర్షించునట్టి, ధారాధరంబుల చందంబునన్ = మబ్బులవలె, బాణవర్షములు = శరవృష్టులు, కురిసినన్=వర్షింపఁగా, (బాణములనువిడువగా) (ఉపమాలంకారము) యాదవసేనలన్=యదుసైన్యములలో, గల దండనాథులు = ఉన్నట్టిసేనానాయకులు, కోదండంబులు= విండ్లను, ఎక్కిడి = ఎక్కుపెట్టి, గుణంబులు = వింటిత్రాళ్ళను, మ్రోయించి = మ్రోగఁజేసి, నిలువంబడిరి, అప్పుడు = ఆసమయంబున.

క. అరి బల భటసాయకముల
హరిబలములు గప్పఁబడిన ♦ నడరెడుభీతిన్
హరిమధ్య సిగ్గుతోడను
హరివదనముఁజూచెఁజకిత ♦ హరిణేక్షణయై. 76

టీ. అరిబల= విరోధసేనలయందైన, భటులు = బంట్లయొక్క, సాయకములన్= అలుగులచేత, హరిబలములు = కృష్ణునిసేనలు, కప్పఁబడినన్ = ఆవరింపఁబడఁగా, అడరెడుభీతిన్=అధికమగు భయముతో, హరిమధ్య = సింగమునడుమువంటి నడుముగలరుక్మిణి, సిగ్గుతోడను = లజ్జతో, చకిత = బెదరుచెందిన, హరిణ = లేడికన్నులవంటి, ఈక్షణయై = లోచనములుగలదియై, హరివదనమున్ = కృష్ణునిముఖమును, జూచెన్ = కాంచెను.

తా. విరోధి బలముచే జుట్టుకొనబడిన కృష్ణుని బలముం గాంచి భయముతో రుక్మిణి శ్రీకృష్ణుని గాంచెను.

వ. ఇట్లుచూచిన, 77

టీ. ఇట్లు = ఈవిధముగా, చూచినన్ = చూడఁగా.

క. వచ్చెద రదె యదువీరులు
వచ్చెద రరిసేనలెల్ల ♦ వైరులు పెలుచన్
నొచ్చెదరును విచ్చెదరును
జచ్చెదరును నేఁడు చూడు ♦ జలజాతాక్షీ. 78

టీ. జలజాత+అక్షీ= పద్మాక్షి, (రుక్మిణీయనిసంబోధన), యదువీరులు= యాదవసేనావీరులు, అదె=అదిగో, వచ్చెదరు= వచ్చుచున్నారు, అరిసేనలన్+ఎల్లన్ = విరోధిసేననంతను, వ్రచ్చెదరు = చీల్చెదరు, వైరులు = విరోధులు, పెలుచన్ = ఎక్కువగా, నొచ్చెదరు = బాధఁ జెందెదరు, విచ్చెదరు = చెదరిపోదురు, చచ్చెదరు = మృతినొందెదరు. చూడు = కనుము.

తా. అదిగో యాదవసైన్యము వచ్చుచున్నది. విరోధిసేనలు బారద్రోలి నొచ్చునట్లుచేసి నాశనముచేయును. జూచెదవుగాక!

వ. అని రుక్మిణీదేవిని హరియూరడించె నంత బలభద్రప్రముఖులైన యదువీరులు ప్రళయవేళ మిన్నునంబన్ని బలు పిడుగు లడరించు పెనుమొగుళులవడువున జరాసంధాది పరిపంథి రాజచక్రంబుమీఁద నవక్రపరాక్రమంబున శిఖిశిఖాసంకాశనిశిత*శిలీముఖ నారాచభల్లప్రముఖంబులైన బహువిధ బాణ పరంపరలు గురియ నదియును విదళిత మత్తమాతంగంబును విచ్ఛిన్న తురంగంబును విచ్ఛిన్న రథవరూథంబును వినిహత పదాతియూథంబును విఖండిత

వాహ వారణ రథారోహణ మస్తకంబును విశకలితవక్షో మధ్యకర్ణకంఠకపోలహస్తంబును విస్ఫోటిత కపాలంబును వికీర్ణ కేశజాలంబును విపాటిత చరణజాను జంఘంబును విదళితదంతసంఘంబును విఘటిత వీరమంజీర కేయూరంబును విభ్రష్టకుండల కిరీటహారంబును విశ్రుత వీరాలాపంబును విదార్యమాణ గదాకుంతతోమర పరశు పట్టిస ప్రాసకరవాల శూలచక్రచాపంబును వినిపాతిత కేతన ఛత్ర చామరంబును విలూన తనుత్రాణంబును వికీర్యమాణ ఘోటకసంఘరింఖా సముద్ధూతధరణీపరాగంబును వినష్ట రథవేగంబును వినివారితసూతమాగధవంది నాదంబును వికుంఠితహయ హేషాపటహ భాంకారకరటిఘటాఘీంకార రథనేమి పటపటాత్కార తురగనాభిఘంటాఘణ ఘణాత్కార వీరహుంకారభూషణ ఝణ ఝణాత్కార నిస్సాణ ధణ ధణాత్కార మణినూపుర క్రేంకార కింకిణీ కిణకిణాత్కారశింజినీటంకారభట పరస్పరధిక్కారనాదంబును వినిర్భిద్యమాన రాజసమూహంబును విద్యమాన రక్తప్రవాహంబును విశ్రూయమాణ భూతభేతాళ కల

---

* శిలీముఖము=బాణము, తుమ్మెద, నారాచము, "సర్వలోహా స్తుయేబాణనారాచాస్తే ప్రకీర్తితాః" ఏబాణమయితే యంతయు లోహమగునో ఆబాణమునకు నారాచమని పేరనియర్థము. ప్రాసము పద్యపాదమున రెండవయక్షరము, ఈఁటె కుంతమనినను, ప్రాసమనినను బల్లెమున కాయర్థము కాన్పించుచున్నది. ఈవచనమున రెండును వాడుటచే గొంచెము భేదముగల ఈఁటెలు కావలయునని తెలిసికొనవలసియున్నది.

కలంబులును విజృంభమాణ ఫేరవ కాక గృధ్ర కంకాది సంకులంబును ప్రచలితకబంధంబును ప్రభూత పలల గంధంబును ప్రదీపిత మేదోమాంస రుధిరఖాదంబును ప్రవర్తిత ఢాకినీ ప్రమోదంబునునై యుండె నప్పుడు,

టీ. అని = ఇట్లు, రుక్మిణీదేవిని, హరి = కృష్ణుఁడు, ఊఱడించెన్ = ఓదార్చెను, అంత = తర్వాతను, బలభద్ర ప్రముఖులు = బలరాముఁడు మున్నగువారు, అయినయదువీరులు = అయినట్టియాదవశూరులు, ప్రళయ వేళన్ = కల్పాంతకాలమునందు, మిన్నునన్ = ఆకాశమునందు, పన్ని = కూడుకొని, బలుపిడుగులు = ఎక్కువయిన పిడుగులను, అడరించు = పుట్టజేయునట్టి, పెను మొగుళుల వడువునన్ = పెద్దమేఘములవలె, జరాసంధ + ఆది = జరాసంధుఁడు మున్నగు, పరిపంథి రాజచక్రంబుమీఁదన్ = విరోధి నృపాల సముదాయముపై, అవక్ర = వంకరలేని (అడ్డులేని), పరాక్రమంబునన్ = శౌర్యముచేత, శిఖి = అగ్నిహోత్రము యొక్క, శిఖాసంకాశ = జ్వాలలతో సమానమగు, నిశిత = వాడియైన, శిలీముఖ = సాయకములు (బాణములు), నారాచ = అచ్చపు లోహబాణములు, భల్ల = ఈఁటెలు, ప్రముఖంబులు = మున్నగునవి, ఐన = అయినట్టి, బహు విధ బాణ పరంపరలు = అనేకరీతులగు బాణ సముదాయములు, కురియన్ = వర్షింపఁగా, అదియును = ఆశరవర్షమును, విదళిత = తెగగొట్టబడిన, మత్త = మదించిన, మాతంగంబులు = గజములు (ఏనుగులు) కలదియు, విచ్ఛిన్న = నఱుకఁబడిన, తురంగంబును = అశ్వములు కలదియు, విచ్ఛిన్న = విడువఁబడిన, రథ వరూథంబును = తేరిసెమ్మెలు (చక్రములోని సీలలనియు, రథముమీఁద కప్పులనియు నర్థములు), గలదియును, వినిహత = చంపఁబడిన, పదాతియూథంబును = కాల్బలముల సముదాయము గలదియును, విఖండిత = ఖండింపఁబడిన (ముక్కలు చేయఁబడిన), వాహ = అశ్వములయొక్కయు, వారణ = ఏనుఁగులయొక్కయు, రథారోహణ = రథికులయొక్కయు

(అనఁగారథమునెక్కినవారు), మ_స్తకంబులు = శిరస్సులుకలదియును, విశకలిత = ముక్కలుచేయఁబడిన, వక్షః = హృదయము (ఱొమ్ము), మధ్య=నడుము, కర్ణ=చెవులు, కంఠ = పత్తుక, కపోల = చెక్కిళ్ళు, హ_స్తములు = కరములు, గలదియు, విస్ఫోటిత = చీల్చబడిన, కపో లంబును=తలపుట్టెలు కలదియును, వికీర్ణ=విడిపోయిన, కేశజాలంబును = శిరోజముల (వెండ్రుకల) సముదాయములుకలదియును, విపాటిత = తెగగొట్టఁబడిన, చరణ = కాళ్ళును, జాను = మోకాళ్ళును, జంఘం బును=పిక్కలుకలదియును, విదళిత=రాల్పఁబడిన, దంతసంఘంబును = పండ్లమొ_త్తము కలదియు, విఘటిత=బ్రద్దలుచేయఁబడిన,మంజీర=శౌర్య బిరుదములఁ దెలుపు నందెలును, కేయూరంబును = బాహుపురులు (భుజకీ_ర్తులు) కలదియును, విభ్రష్ట=జారిపోయిన, కుండల = చెవిపోఁ గులును, కిరీట = కిరీటములును, హారంబులు = హారములు కలదియును, విశ్రుత = వినఁబడుచున్న, వీర + ఆలాపంబులును = పౌరుషశాలుర నాదంబులు కలదియును, విదార్యమాణ = విరువబడుచున్న, గదా = గదలు, కుంత = బల్లెములు, తోమర = చిల్లకోలలు, పరశు = గండ్ర గొడ్డళ్ళు, పట్టిస=అడ్డకత్తులు, ప్రాస = ఈఁటెలు, కరవాల = కత్తులు, శూల = శూలములు, చక్ర = గుండ్రముగా నుండు నాయుధములు, చాపంబులు=విండ్లుకలదియును, వినిపాతిత = పడగొట్టఁబడిన, కేతన ధ్వజములు, ఛత్ర = గొడుగులు, చామరంబును = వింజామరలు కలది యును, విలూన = త్రెంపఁబడిన, తనుత్రాణంబును = మైమరుపులు (కవచములు) కలదియును, వికీర్యమాణ = చిమ్మబడుచున్న, ఘోటక= గుఱ్ఱములయొక్క, సంఘ = సముదాయముయొక్క, రింఖ = డెక్కల చేత, సముద్ధూత = ఎగురఁగొట్టఁబడిన, ధరణీ = భూమియొక్క, పరా గంబును = ధూళి కలదియును, వినష్ట = పోగొట్టఁబడిన, రథవేగం బును = స్యందనముల, త్వరకలదియును, వినివారిత = వారింపఁ బడిన (ఆపబడిన), సూత = సూతుల యొక్కయు, మాగధ = కులములఁ బొగడువారి యొక్కయు, వంది = బట్టువారి యొక్కయు, నాదం

బును = ధ్వనులు కలదియును, విఘంటిత = అడ్డగింపఁ బడిన, హయ = తురగముల యొక్క, హేషా = సకిలింతల యొక్కయు, పటహ = తప్పెటలయొక్క, భాంకార = భాంకృతులయొక్కయు, కరటి=ఏనుఁగులయొక్క, ఘటా=సమూహములయొక్క, ఘీంకార = ఘీంకృతుల యొక్కయు, రథ = రథములయొక్కయు, నేమి=కొనల యొక్క, పటపటాత్కార=పటపటాకృతులయొక్కయు,తురగ=గుఱ్ఱములయొక్క, నాభి = బొడ్డునందలి, ఘంట = ఘంటలయొక్క, ఘణఘణాత్కార=ఘణఘణయను ధ్వనులయొక్కయు, వీర = శౌర్యముగల వారియొక్క, హుంకార=హుంకృతులయొక్కయు, భూషణ = అలంకారముల (నగల) యొక్క, ఝుణఝుణాత్కార = ఝుణఝుణాకృతుల యొక్కయు,మణినూపుర=రత్నములు పొదుగఁబడిన యందెలయొక్క, క్రేంకార = క్రేంకృతులయొక్కయు, కింకిణీ = చిన్నగంటలయొక్క, కిణకిణాత్కార=కిణకిణాత్కృతుల యొక్కయు, శింజినీ = వింటినారి యొక్క, టంకార = టంకృతుల యొక్కయు, భట = బంటుల యొక్క, పరస్పర = ఒక రొకరియొక్క, ధిక్కార = ధిక్కృతుల యొక్కయు, నాదంబును = చప్పుడులు కలదియును (ఇందలి భాంకార శబ్దము మొదలు, ధిక్కార శబ్దపర్యంతము గలది అనుకరణ ధ్వనులం చెలుపు శబ్దములని గ్రహింపవలెను), వినిర్భిద్యమాన=భేదింపఁబడుచున్న, రాజసమూహంబును = రాజసంఘములు కలదియును, విద్యమాన=కలుగుచున్న, రక్తప్రవాహంబును = నెత్తురు వఱదలు కలదియును, విశ్రూయమాణ=వినఁబడుచున్న, భూతభేతాళ కలకలంబును = పిశాచముల యొక్కయు, యమకింకరుల యొక్కయుఁ గేకలుఁ గలదియును, విజృంభమాణ = అతిశయించుచున్న, ఫేరవ = నక్కలు, కాక = కాకులు, కంక = రాబందులు, ఆది=మున్నగువానిచే, సంకులంబును=చుట్టుకొనబడినదియు, ప్రచలిత= ఎగురుచున్న, కబంధమును = మొండెములు కలదియును, ప్రభూత = అధికమగు, పలలగంధంబును = మాంసపువాసనగలదియు, ప్రదీపిత=

మిక్కిలి ప్రకాశించు, మేదః=మెదళ్ళయొక్కయు, మాంస=మాంసములయొక్కయు, రుధిర = రక్తముయొక్కయు, ఖాదంబును = భక్షణముకలదియును, ప్రవర్తిత = పుట్టుచున్న, ఢాకినీప్రమోదంబును = పిశాచ స్త్రీలయొక్క యానందముకలదియును, అయి ఉండెన్ = ఉండెను, అప్పుడు=ఆసమయమందు.

చ. మగిడిచలించి పాఱుచును ♦ మాగధముఖ్యులు గూడి
యొక్కచోఁ, వగచుచునాలిగోల్పడిన ♦ వానిక్రియంగడు
వెచ్చ నూర్చుచున్, మొగమున దప్పిఁదేరదను ♦ ముంద
అఁబొక్కుచు నున్నచైద్యుతోఁ, బగతురచేతిలోఁబడక ♦
ప్రాణముతోడుత నున్నవాఁడవే. 80

టీ. మగిడి = తిరిగి, చలించి = కదలి, పాఱుచున = పరుగిడుచును, మాగధముఖ్యులు=జరాసంధుఁడు మొదలగువారు, ఒక్కచోన్= ఒక్కచోట, కూడి = సమావేశమై, (చేరి) ఆలిన్ = పెండ్లమును, కోల్పడిన వానిక్రియన్ = పోగొట్టుకొనిన వానిరీతి, వగచుచున్ = ఏడ్చుచు, కడున్= మిగుల, వెచ్చన్+ఊర్చుచున్ = వేడినిట్టూర్పులు విడుచుచు, మొగమునన్ = మోమున, దప్పి తేరన్ = ఆయాసము పొడఁగట్టగా, తమముందఱన్= తమయెదుట, పొక్కుచున్= చింతించుచు, ఉన్నచైద్యుతోన్=ఉన్నట్టిశిశుపాలునితో, పగతురచేతిలోన్= విరోధులహస్తమందు, పడక = తగులుకొనక, ప్రాణముతోడుతన్ = జీవముకలిగి, ఉన్నవాఁడవు + ఏ = ఉంటివిగదా ?

తా. జరాసంధాదులు పోరుననోడిపోవుచున్న వాఁడొక తావున సమావేశమై పెండ్లామును బోఁగొట్టుకొనినవానివలె నేడ్చుచున్న శిశుపాలుంగనుంగొని బ్రతికియుంటివా యనిరి.

ఆ. బ్రతుకవచ్చు నోడలఁ ♦ బ్రాణంబులుండిన
బ్రతుకుగలిగెనేని ♦ భార్యగలదు

బ్రతికితీవు భార్య ♦ పట్టు దైవమెఱుంగు
వగవవలదు చైద్య ♦ వలదు వలదు. 81

టీ. చైద్య=శిశుపాలా! ఒడలన్ = శరీరమందు, ప్రాణంబులు + ఉండినన్ = ఉసురులున్నయెడల, బ్రతుకవచ్చును = జీవింపవచ్చును, బ్రతుకు, కలిగెన్+ఏనిన్= ఉన్నయెడల, భార్య= పెండ్లము, కలదు. ఈవు=నీవు, బ్రతికితివి=జీవించితివి, భార్యపట్టు = పెండ్లమువిషయము, దైవము, యెఱుంగున్= తెలియును, (కావున) వగవన్=దుఃఖించుట, వలదు= తగదు, వలదువలదు=తగదుతగదు, (ఒకశబ్దము నే రెండుమూఁడు పర్యాయము లుచ్చరించుట ఆమ్రేడితమనఁబడును. "ఆమ్రేడితంద్విస్త్రిరుక్తం" నిఘంటుప్రమాణము.)

తా. శిశుపాలా! ఒడలియం దుసురులున్నయెడల జీవనమును సంపాదించుకొనవచ్చును. జీవమున్నయెడల భార్యయులభించును. నీవు బ్రతికితివదియేచాలు. భార్యసంగతి దైవమునకెరుక, కావున నీవు చింతింపకుము. ప్రాణములున్న బ్రతుకవచ్చు, బ్రతుకున్న భార్యగలదు, భార్యపట్టు దైవమెఱుంగు (అనుక్రమముచే నిదికారణమాలాలంకారము. ఈ యలంకారము ఆరోహణావరోహణ క్రమమున రెండువిధములు గలది)

వ. వినుము. దేహధారిస్వతంత్రుఁడు గాఁడు. జంత్రగానిచేతి జంత్రపుబొమ్మకైవడి నీశ్వరతంత్ర పరాధీనుండై సుఖదుఃఖంబులయందు వర్తనంబులుసలుపుఁ దొల్లి నేనుమధురాపురంబుపై బదియేడుమాఱులు పరాక్రమంబున విడిసి యాసప్తదశ వారంబులను జక్రిచేత నిర్మూలితబలచక్రుండనై కామపాలుచేతం బట్టుపడి యాకృష్ణుండు కరుణచేసి విడిపించి పుచ్చిన వచ్చి క్రమ్మర నిరువదిమూఁడక్షౌహిణులం గూడుకొని పదినెనిమిదవమాఱు దాడిచేసి

శత్రులందోలి విజయంబు చేకొంటి నిట్టి జయాపజయంబు
హర్షశోకంబుల నెన్నండునుం జెంద నేఁటి దినంబున
నీ కృష్ణుని కెదిరి పోర మనరాజలోకం బెల్ల నుగ్రాత్ముం
గూడికొని పోరిన నోడుదు మింతియు కాక దైవయుక్తం
బయిన కాలంబునం జేసి లోకంబులు పరిభ్రమించు
చుండు నదియునుంగాక. 84

టీ. వినుము=ఆలింపుము, (శిశుపాలునితోఁ జెప్పుచుండెను.) దేహధారి=శరీరము దాల్చినవాఁడు, స్వతంత్రుఁడు=స్వేచ్ఛఁగలవాఁడు, కాడు జంత్రగాని చేతి=యంత్రగానిహస్తమునందున్న, జంత్రపుబొమ్మకైవడిన్ కీలుబొమ్మరీతి, ఈశ్వరతంత్రపర + అధీనుండు+ఐ = భగవంతుని యిష్టమునకు లోబడినవాఁడై, సుఖదుఃఖంబులందున్= సుఖదుఃఖములను రెంటిలో, వర్తనంబులు=నడవడులు, సలుపున్=ఒనరించును. తొల్లి = పూర్వకాలమున, నేను=జరాసంధుఁడనైన నేను, మధురాపురంబుపైన్= మధురానగరముమీఁద, పదియేడుమాఱులు, పరాక్రమంబునన్ = శౌర్యముచే, విడిసి=ఆక్రమించి, ఆ సప్తదశవారంబులు = ఆపదియేడు మాఱులు, చక్రిచేతన్=కృష్ణునిచే, నిర్మూలిత = నాశనము చేయఁబడిన, బలచక్రుండనై =సైన్యసముదాయముగలవాఁడనై, కామపాలుచేతన్= బలభద్రునిచే, పట్టువడి=చిక్కి, ఆ కృష్ణుండు, కరుణచేసి = దయతో, విడిపించి పుచ్చినన్=విడిపించి పంపఁగా, వచ్చి, క్రమ్మఱన్= తిరుగ, ఇరువదిమూఁడు అక్షౌహిణులన్ = ఇరువదిమూఁడు అక్షౌహిణుల సంఖ్యగల సైన్యమును, కూడుకొని = కలసికొని=పదునెనిమిదవమాఱు, దాడిచేసి=యుద్ధమునకు బయలుదేఱి, శత్రులన్= వైరులను, తోలి = పాఱఁదోలి, విజయంబు=జయమును, చేకొంటిని = కాంచితిని, ఇట్టి జయ+అపజయంబులందున్=ఇట్టి గెలుపోటములందు, హర్ష శోకంబులన్ = సంతోషమును, దుఃఖమును, ఎన్నండునున్ = ఏనాడును, చెందన్=పొందను, నేఁటిదినంబునన్ = ఈ దినమున, ఈకృష్ణునకున్,

ఎదిరిపోరన్ = ఎదుర్కొని యుద్ధముచేయుట, రాజలోకంబెల్లన్ = రాజసము దాయమంతయుఉగ్ర + అక్షున్=వేఁడికన్నులుగలశివుని,కూడుకొని = కలసి, ఎదిరి = ఎదుర్కొని, పోరినన్ = యుద్ధముచేసినచో, ఓడుదము, ఇంతియకాక = మఱియు, దైవయుక్తంబు = దైవాధీనము, అయినకాలంబునంజేసి = అయినసమయముచే, లోకంబులు = భువనంబులు (జంతుజాలము), పరిభ్రమించున్ = తిరుగుచు, ఉండున్ = ఉండును, అదియునుఁగాక = అంతియగాక.

మ. తనకుంగాలముమంచిదై నమనలం♦ దై ్రలోక్యవిఖ్యాత వి
క్రములంగెల్చిరి యాదవుల్ హరిభుజా ♦ గర్వంబునన్
నేఁడు కాలముమేలై చనుదెంచెనేని మనమున్ ♦లక్షించి
విద్వేషులన్, సమరక్షోణిజయింత మింతపనికై ♦ శంకింప
నీకేటికిన్. 83

టీ. యాదవుల్ = యాదవులు, తమకు, కాలము = సమయము, మంచిది + ఐనన్=మంచిదికాఁగా, నేఁడు=ఇప్పుడు, హరిభుజా గర్వంబునన్ = కృష్ణుని భుజముల క్రొవ్వువలన, త్రైలోక్యవిఖ్యాతవిక్రములన్ = స్వర్గమర్త్య పాతాళలోకములు మూఁడింటియందును, ఖ్యాతిజెందిన = శౌర్యముగల, మనలన్ = మనలను, గెల్చిరి = జయించిరి, మనమున్ = మనమును, కాలము = సమయము (వేళ), మేలు+ఐ = మంచిదై, చనుదెంచెన్ +ఏని=వచ్చినయెడల, విద్వేషులన్ = విరోధులను, లక్షించి=చూచి, సమరక్షోణిన్=సంగరస్థలమున, జయింతము = గెలుతము, ఇంతపనికి+ఐ = ఈమాత్రముపనికై, నీకు, శంకింపన్ = సందేహింపఁగా, ఏటికిన్=ఎందులకు ?

తా. తమకు మంచికాలమాసన్నమగుటచే యాదవులు మనలనోడించిరి. మనకు మంచికాలమెప్పుడు వచ్చునో యప్పుడు యాదవులనోడింతము కాఁబట్టి విచారింపఁబనిలేదు.

వ. అని యిట్లు జరాసంధుఁడు నతనియొద్ద రాజులును శిశుపాలుని పరితాపంబు నివారించి తమతమభూములకుఁ జనిరి. శిశుపాలుండు ననుచరసేనాసమేతుండై తననగరంబునకుంజనియెనంతరుక్మియనువాఁడుకృష్ణుండు రాక్షసవివాహంబునం దనచెలియలిం గొనిపోవుటకు సహింపక * యేకాక్షౌహిణీబలంబుతోడ సమరసన్నాహంబునం గృష్ణుని వెనుదవిలి పోవుచుఁ దన సారథితో నిట్లనియె.

టీ. అని=పలికి, ఇట్లు=ఈవిధముగా, జరాసంధుఁడు, అతనియొద్ద రాజులును=అతనికడనున్ననృపాలురును, శిశుపాలునిపరితాపంబున్=శిశుపాలుని విచారమును, నివారించి=తగ్గించి, తమతమభూములకున్=తమతమ నివాసస్థలములకు, చనిరి = వెళ్ళిరి, శిశుపాలుండును, అనుచర = సేవకులతోను, సేనా=బలములతోడను, సమేతుండు+ఐ=కూడుకొనినవాఁడై, తననగరంబునకున్ = తనపట్టణమునకు, చనియెన్=పోయెను, అంతన్=అంతట, రుక్మియనువాఁడు, కృష్ణుఁడు, రాక్షసవివాహంబునన్, తనచెలియలిన్ = రుక్మిణిని, కొనిపోవుటకున్ = ఎత్తుకొనిపోవుటకు, సహింపక=ఓర్వఁజాలక, ఏక+అక్షౌహిణీ బలంబుతోడన్=ఒక అక్షౌహిణిలెక్కఁగల సైన్యముతో, సమరసన్నాహంబునన్ = పోరుఁజేయు ప్రయత్నముతో, కృష్ణుని వెనుదవిలి = కృష్ణుని వెను వెంటనంటి, పోవుచున్=వెళ్ళుచు, తనసారథితోన్=తనరథమును నడుపువానితో, ఇట్లు అనియెన్ = ఈ ప్రకారము పలికెను.

ఉ. బల్లిదు నన్ను భీష్మజన ♦ పాలకుమారునిఁ జిన్నఁజేసి నా
చెల్లెలి రుక్మిణిం గొనుచుఁ ♦ జిక్కఁకనిక్కపు బంటువోలె

---

*21870 రథములు, 21870 ఏనుఁగులు, 65610 గుఱ్ఱములు, 109358 కాల్బలముగల సేనకు ఒక అక్షౌహిణియని పేరు.

సీ. గొల్లఁడు వోయెడిన్ రథము ♦ గూడఁగఁ దోలుము
తేజితోల్లసద్భల్ల పరంపరన్ మదముఁ ♦ బాపెదఁ జూపెద
నా ప్రతాపమున్. 86

టీ. బల్లిదున్ = బలవంతుని, భీష్మజనపాలకుమారునిన్, (అయిన) నన్నున్ = నన్ను, చిన్నన్ + చేసి = చిన్నవానినిఁగాదలఁచి, నాచెల్లెలిన్ = నాసోదరిని, రుక్మిణిన్, కొనుచున్ = వెంటనిడుకొనిపోవుచు, చిక్కక = దొరుకక, నిక్కుపుబంటు వోలెన్ = నిజమైనభటునివలె, ఈ గొల్లఁడు = ఈకృష్ణుఁడు, పోయెడిన్ = పోవుచున్నాఁడు, రథమున్ = స్యందనమును, కూడఁగన్ = (అతనిని) కలియునట్లు, తోలుము, తేజిత = పదునుబెట్టఁబడినవియు, ఉల్లసత్ = ఒప్పుచున్నవియు, (అగు) భల్ల పరంపరన్ = ఈఁటె గుంపులచే, మదమున్ = (కృష్ణుని) క్రొవ్వును, పాపెదన్ = నాశనముచేయుదును, నాప్రతాపమున్ = నాశౌర్యమును, చూపెదన్ = అగపఱచెదను.

తా. నన్ను పిల్లవానినిగా నాలోచించి నాచెల్లెలిని కృష్ణుఁ డెత్తుకొని పోవుచున్నాడు. నారథమును వేగముగా నడుపుము. వాని గర్వము నణంచెదను.

వ. అని యిట్లు రుక్మి హరిశౌర్యంబు ఱుంగక సారథి నదలించి రథంబుఁగూడం దోలించి గోపాలక! వెన్నద్రుచ్చ! నిమిషమాత్రంబు నిలు నిలుమని తిరస్కరించి బలువింట నారియెక్కించి మూఁడు వాఁడితూపుల హరి నొప్పించి యిట్లనియె.

టీ. అని, యిట్లు, రుక్మి, హరిశౌర్యంబు = కృష్ణునిపరాక్రమమును, ఎఱుంగక = తెలియక, సారథిన్ = రథముతోలువానిని, అదలించి = ప్రోత్సాహపఱచి, రథంబునన్ = (కృష్ణుని) రథములో, కూడన్ = కలియు

85. చిక్కక = దొరుకక, చిక్కుకొనక, కృశింపక అనియర్థములు.

నట్లు, తోలించి, గోపాలక = పశువులను గాయువాఁడా! వెన్న ముచ్చ=వెన్నదొంగా! నిమిషమాత్రంబు = ఱెప్పపాటుగల కాలము, నిలునిలుము=నిలువుము నిలువుము, అని, తిరస్కరించి = నిందించి, బలువింటన్ = తన గొప్పదియైన కార్ముకము (విల్లు) నందు, నారి = త్రాటిని, ఎక్కించి=ఎక్కపెట్టి, మూఁడు వాఁడి తూపులన్ = పదను గల మూఁడుబాణములచేత, హరిన్=కృష్ణుని, నొప్పించి = నొచ్చునట్లు చేసి, ఇట్లు, అనియెన్ = ఈ విధముగాఁ బలికెను.

సీ. మా సరివాఁడవా ♦ మాపాపఁ గొనిపోవ
నేపాటిగలవాఁడ ♦ వేదివంశ
మెందు జన్మించితి ♦ వెక్కడఁ బెరిఁగితి
వెయ్యది నడవడి ♦ యెవ్వఁడెఱుఁగు
మానహీనుఁడ వీవు ♦ మర్యాద లెఱుఁగవు
మాయఁగైకొని కాని ♦ మలయ రావు
నిజరూపమున శత్రు ♦ నివహంబుపై బోవు
వసుధేశుఁడవుగావు ♦ వావిలేదు

ఆ. కొమ్మనిమ్ము నీవు ♦ గుణరహితుండవు
విడువు విడువవేని ♦ విలయకాల
శిఖిశిఖాసమాన ♦ శిత శిలీముఖముల
గర్వమెల్లగొందు ♦ గలహమందు. 87

టీ. మాపాపన్ = మారుక్మిణిని, కొనిపోవన్=కొనిపోవుటకు, మాసరివాఁడవు+అ = మాతో సమానుఁడవా! (కావనుట) ఏపాటి =

87. ఇందు మాసరివాఁడవా,ఏపాటికలవాఁడవు, కులమేది? ఎచ్చట జన్మించితివి, ఎక్కడ పెరిగితివి, నడవడియెయ్యదియోయెవ్వఁడెఱుంగును, మానహీనుఁడవు, మర్యాదలెఱుంగవు, మాయగైకొని కానిమలయుఁరావు,

ఏకొలఁది, కలవాఁడవు = ఉన్నవాఁడవు, వంశము = కులము, ఏది = ఎక్కడిది, ఎందున్ = ఎచ్చటను, జన్మించితివి = పుట్టితివి? ఎక్కడన్ పెరిగితివి, నడవడి=ఆచారము, ఎయ్యది=ఎట్టిది, ఎవ్వఁడు, ఎఱుఁగున్= తెలిసికొనును, ఈవు=నీవు, మానహీనుఁడవు = గౌరవము లేనివాఁడవు, మర్యాదలు, ఎఱుఁగవు, మాయన్ = మోసమును, కైకొని కొని = వహించిననేకాని, మలయన్ = పోరుటకు, రావు, నిజరూపమునన్ = సహజమైనరూపము చేత, శత్రునివహంబుపైన్ = విరోధిసంఘుమీఁదికి, పోవు=వెళ్లునట్టి, వసుధేశుఁడవు = భూభర్తవు, కావు, వావి = వరుస, లేదు, కొమ్మన్ = రుక్మిణిని, ఇమ్ము, నీవు, గుణరహితుండవు = గుణము లేనివాఁడవు, విడువు=(మా రుక్మిణిని) విడిచి పెట్టుము, విడువవు+ఏనిన్= విడిచిపెట్టకపోతివా, విలయకాల = ప్రళయ సమయమందలి, శిఖి = అగ్నులయొక్క, శిఖా=జ్వాలలతో, సమాన = తుల్యమయిన, శిత =

---

నిజరూపమునశత్రునివహంబుపైబోవువసుధేశుఁడవుకావు, వావిలేదుఅని నిందారూపకమైనశబ్దప్రయోగమునభగవంతుఁడగు కృష్ణునిగౌరవమును ఈకవి వ్యక్తపరచుచున్నాఁడు. మాసరివాఁడవాయనఁగానీవు మనుష్య మాత్రుఁడవు కావనియు, ఏపాటికలవాఁడవు అనగా సామ్యము లేని వాఁడనుట, కులమేదియన స్వయంభువు అనుట, ఎక్కడ జన్మించితివి, ఎక్కడ పెరిగితి వనఁగా, జనన వృద్ధి మరణాదులు లేనివాఁడనుట. నడవడి యెయ్యదియో యెవ్వఁడెఱుఁగుననఁగా ఎవనికి శక్యము గాని చరిత్ర కలవాఁడనుట. మానహీనుఁడవనఁగా నింత యంతయను కొలఁత లేనివాఁడనుట, మర్యాదలెఱుఁగవనఁగా బొలిమేరయెఱుంగని వాఁడనుట, అనఁగా అంతట నిండియున్న వాఁడనుట, మర్యాద = పొలిమేరతీరము, కట్టుపాటు, సమ్మానము అని యర్థములు. మాయ గైకొని కాని మలయరావనఁగా = ప్రపంచమును మోహింప జేయు వాఁడనుట, నిజరూపమున శత్రు నివహంబుపైఁబోవు వసుధేశుఁడవు కావనగా నవతార పురుషుఁడవనుట, వావిలేదనఁగా నొకనితో బంధుత్వము లేనివాఁడనుట,

వాడియైన, శిలీముఖములన్ = బాణముల చేత, కలహమందున్ = పోరునందు, గర్వము = మదమును, ఎల్లన్ = అంతయును, కొందున్ = తీసికొందును, (గర్వమడంచెదననుట).

తా. మాచెల్లెలిని రుక్మిణినితీసికొనిపోవుటకునీవేమిమాతోసమానుఁడవా? భాగ్యవంతుఁడవా? మంచివంశమునఁ బుట్టినవాఁడవా? నీకు పుట్టినచోటును పెరిగినచోటును గలదా? నీకేమిగౌరవముకలదు? నీవు మర్యాదయెఱుంగుదువా? మాయచేగాక నిజమయిన రూపముతో శత్రువుల నోడింపకలవా? మారుక్మిణిని విడువుము. విడువవేని యుద్ధమున నీ పొగరడంచెదను.

వ. అని పలికిన నగధరుండు నగి యొక్క బాణంబున వాని కోదండంబు ఖండించి యాఱుశరంబుల శరీరంబుఁదూఱ నేసి యెనిమిదివిశిఖంబుల రథ్యంబులంగూల్చి రెండమ్ముల సారథింజంపి మూఁడువాఁడితూపులఁ గేతనంబుఁ ద్రుంచి మఱియు నొక్కవిల్లందినం దునిమి వెండియునొక్కధనువు పట్టిన విదళించి క్రమంబునం బరిఘపట్టిస శూల శరాసన శక్తితోమరంబులు ధరియించినం దునుకలుసేసి క్రమ్మఱ నాయుధంబు లెన్నియెత్తినన్నియు శకలంబులుగావించె నంతట దనివిసనక వాఁడు రథంబు డిగ్గి ఖడ్గహస్తుండై దవానలంబు పయిఁబడు మిడుతచందంబునఁ గదిసిన ఖడ్గకవచంబులు చూర్ణంబులు సేసి సహింపక మెఱుం

88. ఈ వచనమున బాణము, కోదండము, శరము, విశిఖము, అమ్ము, తూపు అను బాణ పర్యాయశబ్దములును; ఖండించి, త్రుంచి, తునిమి, విదళించి, తునుకలుచేసి, శకలంబులుచేసి యను శబ్దప్రయోగములు చక్కఁగా జేసి యుండెను.

గఁలు సెదర నడిదంబు వెఱికి జళిపించి వాని శిరంబుఁ
దెగ వ్రేయుదునని గమకించి నడుచుచున్న నడ్డంబువచ్చి
రుక్మిణీదేవి హరి చరణారవిందంబులు పట్టుకొని
యిట్లనియె. ౮౮

టీ. అని పలికినన్= నుడువఁగా, నగధరుండు=కృష్ణుఁడు, నగి= నవ్వి, ఒక్క బాణంబునన్ = ఒక శరముచే, వాని కోదండంబున్ = ఆ రుక్మిచాపమును (వింటిని), ఖండించి = తెగఁగొట్టి, ఆఱుశరంబులన్= ఆఱు సాయకములచే, శరీరంబున్ =దేహమును, తూఱన్ =చొచ్చునట్లు, ఏసి= వైచి, ఎనిమిదిశిఖరంబులన్= ఎనిమిఁదబాణములచేత, రథ్యంబులన్= తేరి గుఱ్ఱములను, గూల్చి= కూలఁజేసి, రెండమ్ములన్= రెండు బాణముల చేత, సారథిన్= రథముదోలువానిని, చంపి, మూఁడువాఁడితూఁపులన్ = మూఁడు పదునుగల బాణములచే, కేతనంబున్ = ధ్వజమును, త్రుంచి= ముక్కలుచేసి, మఱియున్= తిరుగ, ఒకవిల్లు= ఒక చాపమును (ధనుస్సును), అందినన్= అందుకొనఁగా, తునిమి= దానిని ఖండించి, వెండియున్= మఱల, ఒక్కధనువు, పట్టినన్= పట్టుకొనఁగా, విదళించి= దానినివిఱుగగొట్టి, క్రమంబునన్= క్రమముగా, పరిఘ= ఇనుపకట్ల గుదియలు, పట్టిస = అడ్డకత్తులు, శూల = త్రిశూలములు, శర=అమ్ములు, అసి= కత్తులును, శక్తి = చిల్లకోలలు, తోమరంబులు= చిల్లకోలలలోని యాయుధభేదములు, ధరించినన్ = తాల్పఁగా, తునుకలుచేసి= తుండెములుచేసి, క్రమ్మఱన్=తిరుగ, ఆయుధంబులు=శస్త్రాస్త్రములు, ఎన్నిఎత్తినన్=ఎన్నిపూనిన, అన్నియున్ = వానినన్నిఁటిని, శకలంబులు=పరియలు (ముక్కలు), కావించెన్= చేసెను, అంతటన్= ఆసమయమున, తనివి=తృప్తిని, సనక= వహింపక, వాఁడు = ఆరుక్మి, రథంబునన్ =రథమునుండి, డిగ్గి= దిగి, ఖడ్గహస్తుండై= కత్తి చేఁబూనినవాఁడై, దవానలంబుపై = దావాగ్నిమీఁద, పడు, మిడుత చందంబునన్ = పడునట్టి శలభమువలె, కదిసినన్ = చేరఁగా, (కృష్ణునకును రుక్మికిని దవానల శలభము లుపమానము.) ఖడ్గకవచంబులు = (రుక్మి

ధరించిన) కత్తిని, కవచమును, చూర్ణంబులు = పొడులు, చేసి, సహింపక = ఓర్వక, మెఱుంగులు = తళతళయను కాంతులు, చెదరన్ = చెదిరిపోవ, అడిదంబు = ఖడ్గమును, వెటికి = కోశముఁ (ఒఱ) నుండితీసి, జళిపించి = భయము గదురనాడించి, వాని శిరంబు = రుక్మితలను, తెగవేయుదును = నఱికివైచెదను, అని, గమకించి = యత్నముచేసి, నడచుచున్నన్ = వెళ్ళుచుండగా, రుక్మిణీదేవి, అడ్డంబువచ్చి, హరిచరణ + అరవిందంబులు = కృష్ణుని పాదపద్మములను, పట్టుకొని, ఇట్లు, అనియెన్ = ఈప్రకారముగాఁ బలికెను.

మత్త. నిన్ను నీశ్వర దేవ దేవుని ♦ నిర్ణయింపఁగలేక యో
సన్నుతామలకీర్తిశోభిత ♦ సర్వలోక శరణ్య మా
యన్నయీతఁడు నేఁడుచేసె మ♦హాపరాధము నీయెడన్
నన్ను మన్ననఁజేసి కావు మ♦నాథనాథ దయానిధీ. 89

టీ. ఓ సన్నుత = ఓయోగ్యులచేకొనియాడఁబడిన, అమల = శుభ్రమయిన, కీర్తిశోభిత = యశస్సుచేఁబ్రకాశించువాఁడా! ఈశ్వరున్ = ప్రభువును, దేవదేవునిన్ = దేవులకుదేవుని, నిన్ను = నిన్ను, నిర్ణయింపఁగలేక = నీమహత్తునెఱుంగక, సర్వలోకశరణ్య = సకలభువనములను (ప్రపంచములను పరిపాలించువాఁడా! నీయెడన్ = నీయందు, మాయన్న, ఈతఁడు = ఇతఁడు, నేఁడు = ఇప్పుడు, మహత్ = ఘనమయిన, అపరాధము = నేరమును, చేసెన్ = చేసెను, అనాథనాథ = అనాథలను గాపాడువాఁడా, దయానిధీ = కృపకుఁజోటయినవాఁడా! నన్నున్ = నన్ను, మన్ననచేసి = మన్నించి (గౌరవించి), కావుము = కాపాడుము.

తా. దిక్కుమాలినవారికి దిక్కయిన కృష్ణా! భగవంతుఁడగు నీ మాహాత్మ్యము నెఱుంగఁజాలక నీయెడ నాయన్న గొప్ప తప్పిదమును జేసినాఁడు. నాయందు దయగలవాఁడవై కాపాడుము.

మత్త. కల్ల లేదని విన్నవించుటఁగాదు ♦ వల్లభయీతనిన్
బ్రల్లదుం దెగఁజూచితేనియు ♦ భాగ్యవంతులమైతి మే

మల్లుఁడయ్యెముకుందుఁడీశ్వరుఁ ♦ డంచు మోదితులైనమా
తల్లితండ్రులు పుత్రశోకము ♦ దాల్చి చిక్కుదు రీశ్వరా!

టీ. ఈశ్వరా = భగవంతుఁడా! వల్లభ = ప్రాణప్రియుఁడా! కల్ల = నేరములేదు, అని = వచించి, విన్నవించుట = మనవిచేయుట, కాదు, ప్రల్లదున్=దుర్మార్గుని, ఈతనిన్ = ఈరుక్మిని, తెగన్=నఱకుటకు, చూచితి+ఏనిన్ = ఎంచినచో, ఏము = మేము, భాగ్యవంతులము = అదృష్టముతోఁగూడిన వాండ్రము, ఐతిమి, ముకుందుఁడు = కృష్ణుఁడు, ఈశ్వరుఁడు=దేవుఁడు, అల్లుఁడు=జామాత(కూఁతుమగఁడు),అయ్యెన్= అయ్యెను, అంచున్ = అనుచు, మోదితులు = సంతసించువారు, ఐన మాతల్లిదండ్రులు, పుత్రశోకమున్=కుమారునిఁగూర్చి వచ్చిన విచారము, తాల్చి=పూని(వహించి), చిక్కుదురు=కుషిక్కుంతురు(కృశించిపోదురు).

తా. భగవంతుఁడా! నాథా! నాయగ్రజుని (అన్న) యందు నేరము లేదనికాదు. ఈ దుర్మార్గుని మీరు చంపినచో దేవుఁడల్లుఁడయ్యెనని సంతోషపడుచుండు నా జననీజనకులు (తల్లిదండ్రులు) పుత్రశోకమున నవయుదురు.

మ. అనిడగ్గుత్తికతో మహాభయముతో ♦ నాకంపితాంగంబుతో
వినతశ్రాంతముఖంబుతో శ్రుతిచల ♦ ద్వేణీకలాపంబుతో
గనుదోయింజడిగొన్న బాష్పములతోఁ ♦ గన్యాలలామంబు
ప్రొక్కిన రుక్మిం దెగ వేయబోక మగిడెం ♦ గృష్ణుండు
రోచిష్ణుఁడై. 91

టీ. అని=ఇట్లని, డగ్గుత్తికతో=గద్గదస్వనముతో, (స్వరముతో) మహత్ = ఘనమయిన, భయముతో = భీతితో, ఆకంపిత = మిగుల

90. కల్ల=అసత్యవచనము,తప్పు,మోసము,పరుషవచనము అనియర్థములు.

91. అంగము–ఉ. భ. నే. వి. అందము, విధము, సం. అ. న. అవయవము, ఉపాయము, దేహము అని యర్థములు.

చలించుచున్న, అంగంబుతోన్=శరీరముతో, వినత=ఎక్కువ వంగిన దియును, శ్రాంత=బడలినదియు, అగు, ముఖంబుతోన్ = మోముతో, శ్రుతిచలత్=కర్ణముల (చెవుల) నంటి చలించుచున్న (కదలు), వేణీకలాపంబుతోన్=జడయొక్క యలంకారముతో, కనుదోయిన్=నేత్రద్వయమందు (కన్నులజతయందు), జడికొన్న=వర్షించుచున్న (అనఁగా గాఱుచున్న), బాష్పములతోన్ = కన్నీళ్ళతో, కన్యాలలామంబు = బాలికలలో శ్రేష్ఠురాలగు, రుక్మిణి, మ్రొక్కన = వందనము చేయఁగా, కృష్ణుఁడు, రోచిష్ణుండు + ఐ = వెలుఁగువాఁడై, రుక్మిన్ = రుక్మియను వానిని, తెగ వ్రేయఁబోక=చంపుటమాని, మగిడెన్ = తిరిగెను.

తా. రుక్మిణి భీతితో వణఁకుచు శ్రీకృష్ణునకు నమస్కరించి వేడుకొన కృష్ణుండు రుక్మిని జంపక విడిచెను.

వ. ఇట్లు చంపక బావా రమ్మని చిరునగవు నగుచు వానిం బట్టి బంధించి గడ్డంబును మీసంబును తలయును నొకకత్తి వాతి యమ్మున రేవులు వాఱఁ గొఱిగి విరూపిం జేసె నంతట యదువీరులు పరసైన్యంబులం బాఱఁదోలి తత్సమీపంబు నకు వచ్చి రప్పుడు హతప్రాణుఁడై కట్టువడియున్న రుక్మిం జూచి కరుణం జేసి కామపాలుండు వానిబంధంబులు విడిచి హరి డగ్గఱి యిట్లనియె. 92

టీ. ఇట్లు=ఈవిధముగా, చంపక=ప్రాణములు దీయక, బావా! (రుక్మిని కృష్ణుఁడు సంబోధించుట) రమ్ము, అని, చిఱునగవు నగుచు= మందహాసము (మెల్లనినవ్వు) చేయుచు, వానినిన్ = రుక్మిని, పట్టి = పట్టుకొని, బంధించి = కట్టి, గడ్డంబును, మీసంబును, తలయును, ఒక

92. ప్రాణములు దీయక, అనునర్థమున "చంపక" యనియు సంపెగ అర్థముగ చంపక దంత్యతాలవ్య భేదములు వ్రాఁతలో తెలుపకున్నను, సమయ మెఱిఁగి పలుకవలయును.

కత్తివాతి=ఒక ఖడ్గమువంటి వాడిగల, అమ్మునన్=తూపుచేత (బాణము చేత), రేవులు వాఱన్ = జాడలగునట్లు, (అనగా నిండుగా గొఱుగక యొగుడు దిగుడుగా నసహ్యామగునట్లని భావము.) గొఱిగి=క్షౌరముచేసి, విరూపున్=అసహ్యమగు నాకారముగల వానినిగా, చేసెన్=ఒనర్చెను, అంతట, యదువీరులు=యాదవసేనలోని శౌర్యవంతులు, పరసైన్యంబులన్=విరోధిబలములను (విరోధిసేనను,) పాఱఁదోలి = పాఱిపోవునట్లు తఱిమి, తత్=ఆ (శ్రీకృష్ణుని) సమీపంబునకున్=చెంతకు (దగ్గఱకు) వచ్చిరి, అప్పుడు=ఆసమయమున్మన, హతప్రాణుండై = పోయిన ప్రాణమును కలవాఁడై, (అనఁగా జచ్చినట్లని భావము) కట్టువడి= బంధింపబడియున్న రుక్మిన్=ఉన్నట్టిరుక్మిని, చూచి=కనుంగొని, కరుణ+చేసి= దయకలవాఁడై, కామపాలుండు=బలరాముఁడు, వాని=ఆరుక్మియొక్క బంధంబులు=కట్లను, విడిచి=వదలించి (విప్పి), హరిన్=(తమ్ముఁడగు) కృష్ణుని, డగ్గఱి=సమీపించి (చేరి), ఇట్లు, అనియెన్=పలికెను.

క. తల మనక భీష్మనందనుఁ
దలయును మూఁతియును గొఱుగఁ ♦ దగవే బంధుం
దలయును మూఁతియు గొఱుగుట
తలదరుగుటకంటెఁ దుచ్ఛ ♦ తరము మహాత్మా. 93

టీ. మహాత్+ఆత్మా=ఘనమైన స్వభావము గలవాఁడా! (బలరాముఁడు కృష్ణునిసంబోధించుట.) తలము=తొలఁగుము(అనఁగాబోపొమ్మని విడువకయని భావము) అనక=అని చెప్పక, భీష్మనందను=భీష్మరాజు పుత్రుని, తలయును, మూఁతియును, మీసమును, గొఱుగన్ = ముండనము (క్షౌరము) సేయఁగా, తగవు+ఏ = ధర్మమా (కాదనుట),

93. భార్యయందు దప్పుండిన వేఱొకప్రక్కఁ బరుండుట శిక్షయనియు, సేవకునియందు తప్పుండిన తలగొఱిగించుట శిక్ష యనియు, మిత్రునియందు దప్పుండిన మాటలాడకుండుట శిక్షయనియు ధర్మశాస్త్రవచనము. మిత్రులు బంధువులు, నొకగణములోనివారు.

బంధున్ = చుట్టమును, తలయును, మాఱియును, గొఱుగుట, తలన్+తఱుగుటకంటెన్ = శిరస్సును నఱుకుటకన్నను, తుచ్ఛతరము = ఎక్కువనీచము.

తా. కృష్ణా! నేరము చేసిన చుట్టమును మందలించి విడిచిపెట్టుట న్యాయము. వానితో మాటలాడకుండుటయె వానికి శిక్ష. దానినిమాని తలనఱికిన దానికన్న నీచమగు పని నొనరించి చిన్నబుచ్చితివి.

క. కొందఱు రిపులని యలుగవు
గొందఱు హితులనుచు మేలుఁ ♦ గూర్పవు నిజమీ
వందఱియందును సముఁడవు
పొందఁగ నేలయ్య విషమ ♦ బుద్ధి ననంతా! 94

టీ. న+అంతా=అనంతా=నాశనములేనివాఁడా, కొందఱు = కొంతమంది, రిపులు=విరోధులు, అని, అలుఁగవు= కోపమువహింపవు, కొందఱు=కొంతమంది, హితులు=స్నేహితులు, అనుచున్=తలఁచుచు, మేలున్ = మంచిని, కూర్పవు = చేయవు, నిజము = యథార్థము, (సత్యము) ఈవు=నీవు, అందఱియందును = అహితులయందును హితుల యందును, సముఁడవు = తుల్యుఁడవు (సమానుఁడవు), విషమబుద్ధికిన్ = వ్యత్యస్తమైన బుద్ధిని, పొందగన్=వహింపఁగా, ఏల, అయ్య.

తా. కృష్ణా! నీవు, అనిష్టులు నిష్టులు ఒకటియేయైయుండ రుక్మి యందేల విషమ బుద్ధికలవాఁడవైతివి? ఇది తగదు.

వ. అని వితర్కించిపలికి రుక్మిణీదేవి నుపలక్షించి యిట్లనియె.

టీ. అని వితర్కించి=సంశయించి, పలికి=చెప్పి, రుక్మిణీదేవిన్, ఉపలక్షించి=వీక్షించి (చూచి), యిట్లు అనియెన్=ఇట్లుపలికెను.

శా. తోడంబుట్టినవానిభంగమునకున్ ♦ దుఃఖించిమాకృష్ణునె
గ్గాడంజూడకుమమ్మపూర్వభవ క ♦ర్మాధీనమైప్రాణులన్

గీ॥ కీడుమేలును జెందు లేఁడొకఁడు ♦ శిక్షింపంగ రక్షింప నీ
తోఁడంబుట్టువు కర్మశేషపరిభూతుండ ♦ య్యె నేఁ డియ్యెడన్.

టీ. అమ్మ=(రుక్మిణి)తల్లీ! తోడబుట్టినవాని భంగమునకున్ = అన్నగారగు రుక్మికి జరిగిన యవమానమునకు, దుఃఖించి = విచారించి (ఏడ్చి), మాకృష్ణునిన్, ఎగ్గు=కీడుమాటలు, ఆడన్=పలుకుటకు. చూడకుము=ఎంచకుము, పూర్వభవ=క్రిందటిజన్మమందలి, కర్మ=కర్మమునకు, అధీనము+ఐ=సంబంధముకలదియై, కీడున్, మేలును, ప్రాణులన్ = జంతువులను, చెందున్ = పొందును, శిక్షింపంగన్=శిక్షించుటకును, రక్షింపన్=కాపాడుటకును, ఒకఁడు, లేఁడు, (కర్మవశమున వచ్చును గాని కీడు మేళ్ళ నెవ్వరును చేయఁజాలరనుట), నీతోడంబుట్టువు=రుక్మి, నేఁడు = ఇప్పుడు, ఈ+ఎడన్ = ఈస్థలమందు, (ఇచ్చోట), కర్మ = తొల్లి చేసిన కర్మముయొక్క, శేష=మిగిలినదానిచే, పరిభూతుండు = అవమానింపఁబడినవాఁడు, అయ్యెన్=అయ్యెను.

తా. రుక్మిణీ! నీయన్నపడిన యవమానమునకై విచారము కలదానవై మాకృష్ణుని నిందింపకుము. కీడుమేళ్లు ప్రాణికోటికి కర్మానుసారములై వచ్చుచుండును. అందువలననే నేఁడు మీయన్న యగౌరవమునకుఁ బాత్రుఁడయ్యెను.

క. చంపెడి దోషము కలిగిన
జంపఁజనదు బంధుజనుల ♦ జను విడువంగా
జంపిన దోషము సిద్ధము
చంపఁగ మఱి యేల మున్న ♦ చచ్చినవానిన్. 97

టీ. బంధుజనులన్=చుట్టములను, చంపెడిదోషము కలిగినన్ = చంపదగినంత నేరమున్నను, చంపన్, చనదు=తగదు, విడువంగాన్ = విడుచుట, చనున్=ఒప్పును, చంపినన్, దోషము=దురితము (పాపము), సిద్ధము = నిశ్చయము, (తప్పక పాపము గలుగును), మున్ను + ఆ =

మనుచే, చచ్చినవానిన్ = మృతినొందిన వానిని, మఱి = తిరుగ, చంపను+ఏల = చంపుట ఎందులకు ? (చంపఁదగదనుట)

తా. నేరము చేసిన చుట్టమును జంపవలసియున్నను వదలిపెట్టవలెను. తప్పుజేసి చచ్చియున్నవానినిఁ దిరుగఁ జంపుటవలన దోషము లభించును.

ఆ. బ్రహ్మచేత భూమి ♦ పతుల కీధర్మంబు
కల్పితంబు రాజ్య ♦ కాంక్షఁ జేసి
తోడి చూలునైనఁ ♦ దోడబుట్టినవాఁడు
చంపుచుండుఁ గ్రూర ♦ చరితుఁ డగుచు. 98

టీ. తోడబుట్టినవాఁడు = సహజన్ముఁడు (సోదరుఁడు), రాజ్యకాంక్షన్ + చేసి = రాజ్యమునందుఁగల యాశచే, క్రూరచరితుఁడు = దుష్టచారిత్రము కలవాఁడు, అగుచున్=అగుచు, తోడిచూలు నైనన్= తోఁబుట్టినవానినైన, చంపుచున్, ఉండున్=ఉండును, ఈధర్మంబు= ఈన్యాయము, భూమిపతులకున్ = పుడమిఱేండ్లకు (రాజులకు), బ్రహ్మచేతన్=విధిచేత, కల్పితంబు = కల్పింపఁబడినది.

తా. రాజ్యముగోరి యన్నదమ్ములు పోరుట రాజధర్మముగా విధి కల్పించియుండెను.

క. భూమికి ధన ధాన్యములకు
భామలకును మానములకుఁ ♦ బ్రాభవములకుం
గామించి మీఁదుఁ గానక
శ్రీమదమున మానఘనులు ♦ చెనకుదురొరులన్.

టీ. మానఘనులు = గౌరవములచే గొప్పవారు, భూమికిన్ = పుడమికొఱకును (అనఁగా రాజ్యమునకు ననుట), ధన = ద్రవ్యమునకును, ధాన్య= ధాన్యమునకును, భామలకును = స్త్రీలకును, మానములకున్= మర్యాదలకును, ప్రాభవములకున్ = ప్రభుత్వములకును (దొర

తనములకు), కామించి=కాంక్షించి (కోరి), శ్రీమదమునన్ = ధనమం
దలి మత్తతచే, మీఁదుఁగానక= పైవచ్చునది చూడక, (అనఁగా మంచి
చెడ్డలను విచారింపకయని భావము), ఒరులన్=పరులను (శత్రువులను),
చెనకుదురు= ఎదిరింతురు.

తా. గౌరవముగల రాజులు రాజ్య ధన ధాన్య స్త్రీ గౌరవముల
కొఱకు విరోధులతో యుద్ధము సేయుదురు.

వ. వినుము దేవమాయం జేసి దేహాభిమానులైన మానవు
లకు బగవాఁడు బంధుం డుదాసీనుం డను భేదంబు
మోహంబున సిద్ధంబయి యుండు జలాదులయందుఁ జంద్ర
సూర్యాదులును ఘటాదులయందు గగనంబును బెక్కు
లయి కానఁబడుభంగి దేహధారుల కందఱకు నాత్మ
యొక్కండయ్యును బెక్కండై తోఁచు నాద్యంతంబులును
గల యీ దేహంబు ద్రవ్య ప్రాణ గుణాత్మకంబయి
యాత్మయందు నవిద్యచేత గల్పితంబై దేహిని సంసారం
బునం ద్రిప్పుసూర్యుండు తటస్తుండై యుండ దేహేంద్రి
యంబులు ప్రకాశమానంబులయిన దృష్టి రూపంబులం
బోలె నాత్మతటస్థుండై యుండ దేహేంద్రియంబులు ప్రకా
శమానంబులగు నాత్మకు వేరొక్కటితోడ సంయోగ
వియోగంబులు లేవు; వృద్ధి క్షయంబులును చంద్ర కళ
లకుం గాని చంద్రునకు లేని కైవడి జన్మనాశంబులు
దేహంబునకుంగాని యాత్మకుగలుఁగ నేరవు; నిద్రవోయిన
వాఁడాత్మను విషయఫలానుభవంబులు సేవించు తెఱం
గున నెఱుక లేనివాఁడు నిజముగాని యర్థంబునందును
ననుభవంబు నొందుచుండుఁ గావున.

టీ. వినుము=ఆలకింపుము, దేవమాయంజేసి=భగవంతుని మాయ చేత, దేహ+అభిమానులు = ఒడలియందెక్కువ గౌరవము కలవారు, అయిన= అయినట్టి, మానవులకున్=మనుజులకు, బగవాఁడు = విరోధి, బంధుఁడు= చుట్టము (అనఁగా నిష్టుఁడనుట), ఉదాసీనుండు=ఏ సంబంధము లేనివాఁడును, అనుభేదంబు=అనునట్టి భేదబుద్ధి, మోహంబునన్= జ్ఞానము లేమిచేత, సిద్ధంబు+ఐ= వచ్చినదియై, ఉండున్ = ఉండును, జలాదులయందున్ = ఉదకము మున్నగాఁగల వానియందు, చంద్ర సూర్య+ ఆదులును= చంద్రుఁడు, సూర్యుఁడు మొదలయినవి, ఘట + ఆదులయందున్ = కుండ మున్నగు వానియందు, గగనంబులు = ఆకసములు, పెక్కులై= అనేకములై, కానంబడు భంగిన్ = అగుపడురీతి, దేహధారులకున్ = దేహము దాల్చిన, అందఱకు=ఎల్ల ప్రాణులకు, ఆత్మ= జీవుండు, ఒక్కఁడు, అయ్యును, పెక్కండ్రు + ఐ = అనేక విధములై, తోఁచున్= కాన్పించును, ఆది+అంతంబులు = మొదలును, తుదయు (జననమరణములనుట), కల యీ దేహంబులు=గలిగినట్టి యీ యొడలు, ద్రవ్యప్రాణగుణ ఆత్మకంబుఐ=పృథివ్యాధి భూతపంచకమును ఇంద్రియములును సత్త్వరజస్తమోగుణంబులును స్వరూపముగా కలదియై, (ఆదిభూతము, అధ్యాత్మము, అధిదైవము, అనురూపములుకలదియై యనిభావము) ఆత్మయందునన్=జీవునితో, అవిద్యచేతన్=అజ్ఞానముచే (జ్ఞానములేమిచే), కల్పితంబై=కల్పింపఁ బడినదైన, దేహిని=ప్రాణిని, సంసారంబునన్ = అజవంజనంబున, (అనఁగా దారాపుత్రాదులు, ధనధాన్యాది కాంక్షగల భవబంధమునందనుట) త్రిప్పున్ = తిరుగ జేయును, సూర్యుండు = భాస్కరుఁడు, తటస్థుండు = ఉదాసీనుఁడు, ఐ, ఉండన్ = ఉండగా, ప్రకాశ మానంబులు = వెలుఁగొందునవి, అయినదృష్టి రూపంబులుంబోలెన్=అయినట్టి నేత్రములు, ఆకారము, మున్నగునవివలె, ఆత్మ = జీవుఁడు, తటస్థుండై = ఉదాసీనుఁడై, ఉండన్ = ఉండగా, దేహ + ఇంద్రియంబులు = ఒడలు, నింద్రియములును, ప్రకాశమానంబులు = వెలుగుచున్నవి, అగున్ = అగును,

(ఉపమాలంకారము) ఆత్మకున్ = జీవునకు, వేఱొక్కటి తోడన్ = ఇంకొక వస్తువుతో, సంయోగ వియోగంబులు = కలియుట, యెడబాయుట, లేవు, వృద్ధిక్షయంబులు=ఎక్కువతక్కువలు, చంద్రకళలకుం గాని = చంద్రుని కళలకే తక్క, చంద్రునికి లేనికైవడిన్ = శశికి లేనియట్లు, జన్మనాశనంబులు = పుట్టుకయుఁ జావును, దేహంబునకుం గాని = ఒడలికి తప్ప, ఆత్మకున్ = జీవునికి, కలుగ నేరవు, (అమావాస్యనాడు చంద్రకళలన్నియు నశించినను చంద్రుఁడు సూర్యగతుఁడై యుండునని శాస్త్రము), నిద్రపోయినవాఁడు=నిద్రించువాఁడు, ఆత్మను = చిత్తమునందు, విషయ ఫల + అనుభవంబు = విషయ సుఖములను, వానివలనఁ గలుగు సుఖదుఃఖ ఫలానుభవములను, సేవించు తెఱంగునన్ = భజించురీతిని (అనుభవించునట్లు), ఎఱుకలేనివాఁడు = జ్ఞానహీనుఁడు (అజ్ఞాని), నిజము కాని అర్థంబునందుఁ=సత్యము కాని యీ సంసారమునందు, అనుభవంబు = సంబంధము, ఒందుచు = పొందుచు, ఉండుఁ, కావునన్ = కాన.

క. అజ్ఞానజమగు శోకము
విజ్ఞాన విలోకనమున ♦ విడువుము నీకుం
బ్రజ్ఞావతికిం దగునే
యజ్ఞానులభంగి వగవ ♦ నంభోజముఖీ. 101

టీ. అంభోజముఖీ = పద్మములవంటి వదనముగల (మోముగల), రుక్మిణీ! అజ్ఞానము=జ్ఞానము లేమిచేఁ గలిగినది, అగు శోకమున్ = అయిన విచారమును, విజ్ఞానవిలోకనమునన్ = జ్ఞానముతోఁగూడిన చూపుచే, విడువుము=విడిచిపెట్టుము (వదలుము), ప్రజ్ఞావతికిఁ = బుద్ధిగల దానికి, నీకుఁ, అజ్ఞానులభంగిన్=జ్ఞానహీనులబోలె, వగవన్= దుంఖింపఁగా, తగును+ఏ=తగునా ! (తగదనుట),

తా. బుద్ధిమంతురాలవగు, నీవు బుద్ధిలేని వారివలె విచారించుట మంచిదికాదు. కావున విచారముడుగుము.

వ. ఇట్లు బలభద్రునిచేతఁ దెలుపంబడి రుక్మిణీదేవి దుఃఖంబు మానియుండెనట రుక్మియనువాఁడును బ్రాణావశిష్టుండై విడువంబడి తన విరూపభావంబునకు నెరియుచు హరిని గెలిచికాని కుండినపురంబు సొరనని ప్రతిజ్ఞసేసి తత్పుర సమీపంబున నుండె నవ్విధంబున, 102

టీ. ఇట్లు = ఈవిధముగా, బలభద్రునిచేతన్ = బలరామునిచే, తెలుపఁబడి= తెలియఁజేయబడి, రుక్మిణీదేవి, దుఃఖంబున్=విచారమును, మాని = వదలి, ఉండెన్ = ఉండెను, అటన్ = అక్కడ, రుక్మియను వాఁడును, ప్రాణ+అవశిష్టుండు+ఐ = జీవములు మాత్రము మిగిలిన వాఁడై, తన = తనయొక్క, విరూపభావంబునకున్ = అసహ్యమగు నాకారముతో నుండుటకు, ఎరియుచున్=తపించుచు (దుఃఖించుచు), హరిన్=కృష్ణుని, గెలిచికాని-జయింపకుండ, కుండినపురంబు, చొరను= ప్రవేశింపను (వెళ్ళను), అని, ప్రతిజ్ఞ=శపథంబును, చేసి = ఒనరించి, తత్+ఆ పురసమీపంబునన్ = కుండినపురము చేరువను, ఉండెన్ = ఉండెను, ఈ+విధంబునన్=ఈరీతిగా (ఈప్రకారము).

క. రాజీవలోచనుఁడు హరి
రాజసమూహముల గెలిచి ♦ రాజస మొప్పన్
రాజిత యగు తన పురికిని
రాజాననఁ దెచ్చె బంధు ♦ రాజి నుతింపన్. 103

టీ. రాజీవలోచనుఁడు=పద్మములవంటి నేత్రములు గలవాఁడు, హరి=కృష్ణుఁడు, రాజసమూహములన్ = నృపాలుర సముదాయమును, గెలిచి=జయించి, రాజసము = ప్రాభవము (ప్రభుత్వము), ఒప్పన్ = ఒప్పుచుండఁగా, రాజిత = ప్రకాశించుచున్న, అగు తనపురికిన్ = అయిన తననగరమునకు (ద్వారకాపట్టణమునకు), రాజ+ఆననన్= చంద్రునివంటి ముఖముగల రుక్మిణిని, బంధురాజి = చుట్టములగుంపు,

నుతింపన్ = స్తోత్రము చేయఁగా (కొనియాడఁగా), తెచ్చెన్ = తీసి కొనివచ్చెను.

తా. కృష్ణుఁడు వైరి నృపాలురను జయించి తనవారికి సంతస మగునట్లు రుక్మిణిని, ద్వారకాపురమునకుఁ దీసికొనివచ్చెను.

వ. అంత నయ్యాదవేంద్రుని నగరంబు సమారబ్ధ వివాహ కృత్యంబున బ్రవర్తమాన గీతవాద్య నృత్యంబును బ్రతి గృహాలంకృతాశేష నరనారీవర్గంబును బరిణయ మహో త్సవ సమాహూయమాన మహీపాల గజఘటాగండ మండల దాన సలిలధారాసిక్త రాజమార్గంబును బ్రతి ద్వార మంగళాచార సంఘటితక్రముక కదళికా కర్పూర కుంకుమాగరు ధూపదీప పరిపూర్ణ కుంభమును విభూషిత సకల గృహవేదికా కవాటదేహళీ స్తంభంబును విచిత్ర కుసుమాంబర రత్నతోరణ విరాజితంబును సముద్ధూత కేతన విభ్రాజితంబు నై యుండె నయ్యవసరంబున, 104

టీ. అంతన్ = అంతట, ఆ + యాదవేంద్రుని నగరంబు = ఆ యదూత్తముఁడగుకృష్ణునిపురము, సమారబ్ధ=ప్రారంభింపఁబడిన, వివాహ కృత్యంబును = వివాహకార్యమును (పెండ్లి పనులు) కలదియు, ప్రవర్తమాన=జరుగుచున్న, గీతవాద్య నృత్యంబును=సంగీతము, వాద్య ములు, నాట్యములు గలదియును, ప్రతిగృహ=అన్ని యిండ్లయందును, అలంకృత=అలంకారము చేయఁబడిన, అశేష=ఎల్ల, నర=పురుషులయు, నారీ=సుందరీమణులయు, వర్గంబును = సముదాయము కలదియును, పరిణయ = పెండ్లియనెడి, మహత్ = ఘనమైన, ఉత్సవ = పర్వము (పండుగు) కొఱకు, సమాహూయమాన=ఆహ్వానింపఁబడిన (పిలువఁ బడిన), మహీపాల = భూభర్తలయొక్క (రాజులయొక్క), గజ =

104. తోరణము, తోరణ అని రెండు ప్రయోగములును గలవు.

ద్విజము (ఏనుఁగు) లయొక్క, ఘటా=సమూహము (గుంపు)లయొక్క, గండ = చెక్కిళ్ళయొక్క, మండల = ప్రదేశములయొక్క, (స్థలముల యొక్క), దానసలిల = మదజలముయొక్క, ధారా = ప్రవాహము (చాలు) చేత, సిక్త = తడుపఁబడిన, రాజమార్గంబును = రాజవీధులు కలదియు, ప్రతిద్వార = అన్నివాకిళ్ళయందును, మంగళ = జయము కొఱకును, ఆచార = పద్ధతులచే (ఏర్పాటుచే), సంఘటిత = కూర్పఁ బడిన, క్రముక = పోక చెట్లును, కదళికా = అరఁటిచెట్లును, కర్పూర= కప్పురమును, కుంకుమ = కుంకుమయును, అగరు = అగరువత్తుల యొక్కయు, ధూప=పొగయును, దీప=దీపములును, పరిపూర్ణకుంభ మును=జలముచేనింపిన కుండలుకలదియును, విభూషిత = అలంకరింపఁ బడిన, సకల=సమస్తములయిన, గృహ=మందిరముల (ఇండ్ల) యొక్క, వేదికా = తిన్నెలును, కవాట = తలుపులు, గేహళీ = గడపలును, స్తంభమును = కంభములు కలదియును, విచిత్ర = అనేకరీతులగు, కుసుమ=పుష్పములచేత, అంబర = వసనముల (బట్టల చేతను), రత్న= మణులయొక్క, తోరణ= తోరణములచేతను (సరములచేతను), విరాజి తంబును = ప్రకాశించుచున్నదియు, సముద్ధూత=మీఁది కెగురఁగొట్ట బడిన, కేతన = ధ్వజములచే (టెక్కెములచే), విభ్రాజితంబును = మిగులప్రకాశించుచున్నదియునై, ఉండెన్ = ఉండెను, ఆ+అవస రంబునన్ = ఆసమయమున.

మ. ధ్రువకీర్తిన్ హరి పెండ్లియాడె నిజచే। తోహారినిన్ మానవై
భవగాంభీర్యవిహారిణిన్ నిఖిలసం। పత్కారిణిన్ సాధు బాం
ధవసత్కారిణిఁ బుణ్యచారిణి మహా। దారిద్ర్య సంహారిణిన్
సువిభూషాంబరధారిణిన్ గుణవతీ। చూడామణిన్ రుక్మిణిన్.

105. మొదట రాక్షసవివాహమునఁ బరిగ్రహించి పాణిగ్రహ ణోత్సవము జరిపినను, వివాహాచారమును సర్వజన సంతోషార్థము మఱల నింటికివచ్చి యుత్సవమునకై చేసినారని తాత్పర్యము.

టీ. హరి = కృష్ణుఁడు, ధ్రువకీర్తిన్ = నిశ్చలమైన యశస్సుగల దానిని, నిజచేతః+హారిణిన్=తన చిత్తమును హరించుదానిని (అనఁగా మనోహరిణియని), మాన=గౌరవము చేతను, వైభవ=ఐశ్వర్యము చేతను, గాంభీర్య=గంభీరత్వము చేతను, విహారిణిన్ = విహరించుదానిని, నిఖిల సంపత్తు = సకలభాగ్యములు, కారిణిన్ = కలిగించుదానిని, సాధు = సత్పురుషులను, బాంధవ = చుట్టములను, సత్కారిణిన్ = గౌరవించు దానిని, పుణ్యచారిణిన్=పుణ్యకార్యములు చేయుదానిని, సువిభూషాంబరధారిణిన్ = మంచియలంకారములగు వస్త్రములను దాల్చుదానిని, గుణవతీచూడామణిన్ = గుణవంతురాండ్రగు స్త్రీలకు శిరోరత్న మయిన దానిని, రుక్మిణిన్ = రుక్మిణీదేవిని, పెండ్లియాడెన్ = వివాహము చేసికొనెను.

తా. భాగ్యవంతురాలగు రుక్మిణిని కృష్ణుఁడు పెండ్లియాడెను.

క. సతులుం దారును బౌరులు
హితమతిఁ గానుకలు దెచ్చి ♦ యిచ్చిరి కరుణో
న్నతవర్ధిష్ణులకును మా
నితరోచిష్ణులకు రుక్మి ♦ ణీ కృష్ణులకున్. 106

టీ. సతులన్ = ఉవిదలును (స్త్రీలును), తారును = తామును, పౌరులు=పట్టణప్రజలు, హితమతిన్=ఇష్టమయినబుద్ధితోను, కానుకలు= కట్నములను, కరుణ=కృపచే, ఉన్నత = అధికమైన, వర్ధిష్ణులకున్ = వృద్ధిగలవారికి, మానిత = గౌరవింపఁబడిన, రోచిష్ణులకు=కాంతిగల వారికి, రుక్మిణీకృష్ణులకున్=రుక్మిణీదేవికిని, కృష్ణమూర్తికిని తెచ్చిఇచ్చిరి.

తా. ద్వారకా పురజను లందఱును రుక్మిణికి, కృష్ణునకును కానుకలు దెచ్చి యొసంగిరి.

క. హరిపెండ్లికిఁ గైకేయక
కురుసృంజయ యదువిదర్భ ♦ కుంతి నరేంద్రుల్

పరమానందము బొందిరి
ధరణీశులలోన గాఢ ♦ తాత్పర్యమునన్. 107

టీ. హరిపెండ్లికిన్ = కృష్ణుని వివాహమువలన, కైకేయక, కురు, సృంజయ, యదు, విదర్భ, కుంతి, వర+ఇంద్రుల్ = ఈదేశపురాజేంద్రులు, ధరణీశులలోనన్ = రాజులలో, గాఢ = ఎక్కువయిన, తాత్పర్యమునన్ = అభిప్రాయముతో (అనఁగా స్నేహబుద్ధితో), పరమ+ఆనందమున్ = ఎక్కువయిన సంతసమును, పొందిరి = చెందిరి.

తా. అనేక దేశాధీశ్వరులు శ్రీకృష్ణుఁడు రుక్మిణిం బెండ్లియాడెనని యానందించిరి.

క. హరి యీ తెఱఁగున రుక్మిణి
నరుదుగఁ గొనివచ్చి పెండ్లి ♦ యాడుటవిని దు
ష్కరకృత్య మనుచు వెఱఁగం
దిరి రాజులు రాజసుతులు ♦ దిక్కులనెల్లన్. 108

టీ. హరి = కృష్ణుఁడు, ఈతెఱఁగునన్ = ఈవిధముగా, రుక్మిణిన్ = రుక్మిణీదేవిని, అరుదుగన్ = ఆశ్చర్యముగా (వింతగా), కొనివచ్చి = తీసికొనివచ్చి, పెండ్లియాడుటన్ = వివాహము చేసికొనిన విషయమును, విని = ఆలించి, దిక్కులన్+ఎల్లన్ = సకలదిశలయందును (అన్నిదిక్కులయందు), రాజులు, రాజసుతులు = రాజకుమారులు, దుష్కరకృత్యము = చేయశక్యముగానిపని, అనుచున్ = అంచు, వెఱఁగు = విస్మయమును (ఆశ్చర్యమును), అందిరి = చెందిరి.

తా. కృష్ణుఁ డీవిధముగా రుక్మిణీదేవిం గొనితెచ్చి పెండ్లియాడుట ఘనమైనకార్యమనియు, నొరులకు సాధ్యమయినదికాదనియు సకలదిక్కులంగల రాజులు, రాజకుమారులును ఆశ్చర్యమును వహించిరి.

ఆ. అనఘ యాదిలక్ష్మి ♦ యైన రుక్మిణితోడఁ
గ్రీడ సలుపుచున్న ♦ కృష్ణుఁజూచి

పట్టణంబులోని ♦ ప్రజ లుల్లసిల్లిరి
ప్రీతులగుచు ముక్త ♦ భీతులగుచు. 109

టీ. అనఘ= అఘము లేనివాఁడా (అనగాఁ బాపరహితుఁడా యనుట), న+అఘ=అనఘ, (ఇది పరీక్షిన్మహారాజు సంబోధనము) ఆది లక్ష్మి=పూర్వము లక్ష్మీదేవి, ఐన రుక్మిణితోడన్=అయినట్టి రుక్మిణితోఁ గూడ, క్రీడ=విహారము, సలుపుచు+ఉన్నకృష్ణునిన్= చేయు కృష్ణుని, చూచి = వీక్షించి, పట్టణంబులోని ప్రజలు = పురములోని జనులు, ప్రీతులు= ప్రేమగలవారు, అగుచున్, ముక్త= వదలఁబడిన, భీతులు = భయముగలవారు, అగుచున్, ఉల్లసిల్లిరి= సంతోషమును జెందిరి.

తా. ఆదిలక్ష్మియగు రుక్మిణితో భగవంతుఁడగు శ్రీకృష్ణుఁడు క్రీడించు చుండుటం గాంచి యప్పురిం గల జనులు భయములేనివారై యానందించిరి.

వ. అని యిట్లు చెప్పి. 110

టీ. అనియిట్లు = ఈ ప్రకారము, చెప్పి.

క. కువలయ రక్షాతత్పర
కువలయదళ నీలవర్ణ ♦ కోమల దేహా
కువలయనాథ శిరోమణి
కువలయజనవినుత మిగుల ♦ గుణసంఘాతా. 111

---

109. పరీక్షిత్తు=అభిమన్యుని కొడుకు, తల్లిఉత్తర, కొడుకు జనమేజయుఁడు, శమీకుని కొడుకు శృంగి యనువాఁడు తన తండ్రిమెడను చచ్చినపామును వైచిపోయెనను మాటవిని అదిమొదలు ఏడవ దినముల లోపల నీ పరీక్షిత్తు తక్షకసర్పముచేఁ గఱవఁబడి చచ్చుంగాక యని శపించెను. ఆవృత్తాంత మీరాజు విని విరక్తుఁడై శుకమహర్షి వలన భాగవతకథనువిని, ఆయేడవ నాఁడు తక్షకుఁడు వచ్చి కఱవఁగా మృతుఁడై ముక్తి నొందెను.

టీ. కువలయ=పుడమిని (భూమిని), రక్షా=కాపాడుటయందు, తత్పర=ప్రేమగలవాఁడా, కువలయదళ= కలువరేఖలంబోలె, నీలవర్ణ= నల్లని చాయగల, కోమలదేహ = మనోహరమైన యొడలుకలవాఁడా, కువలయనాధ= భూనాయకుల (రాజుల)కు, శిరోమణి = శిరోరత్నము వంటివాఁడా, కువలయ = భూవలయమునందలి, జన = ప్రజలచేత, వినుత = నుతింప బడిన, విమల = నిర్మలమైన, గుణ=మంచి గుణముల యొక్క, సంఘాతా= సముదాయము కలవాఁడా!

తా. మిక్కిలి యాసక్తితోఁ బుడమిని రక్షించువాఁడా! సుకుమారమగు నీలవర్ణపు శరీరముగలవాఁడా! రాజోత్తమా! సర్వజనులచే బొగడఁదగిన మంచి గుణసంపత్తికలవాఁడా! శ్రీరామచంద్రా! (అని కృతినాయకుని సంబోధనము).

మాలిని. సరసిజనిభహస్తా ♦ సర్వలోక ప్రశస్తా!
నిరుపమ శుభమూర్తీ ♦ నిర్మలారూఢకీర్తీ
పరహృదయ విదారీ ♦ భక్తలోకోపకారీ
గురుబుధజనతోషీ ♦ ఘోరదైతేయశోషీ.

టీ. సరసిజనిభ=పద్మములతో సమానమైన, హస్తా = కరములు గలవాఁడా, సర్వలోక ప్రశస్తా = సకల లోకములయందు ఖ్యాతిని జెందినవాఁడా, నిరుపమశుభమూర్తి=సాటిలేనట్టియు, శుభప్రదమునగు శరీరముకలవాఁడా, నిర్మల + ఆరూఢకీర్తి = కలుషరహితమైన (దోషములేని) ప్రఖ్యాతికెక్కిన యశస్సు కలవాఁడా, పరహృదయ= విరోధుల గుండెలను, విదారీ=చించువాఁడా, భక్తలోక+ఉపకారీ = భక్తజన సముదాయమునకు మేలును జేయువాఁడా, గురుబుధజనతోషి= గురువులను విద్వాంసులను ఆనందపఱచువాఁడా, ఘోరదైతేయ = భయంబును గలుగజేయు రాక్షసులను, శోషీ=నాశనము చేయువాఁడా (కృతీశ్వరుఁడా అని సంబోధనము.)

గద్యము. ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసన మంత్రిపుత్ర సహజ పాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన శ్రీమహాభాగవతం బను పురాణమునందు రుక్మిణీ జననంబును రుక్మిణీ సందేశంబును వాసుదేవాగమనంబును రుక్మిణీ గ్రహణంబును రాజలోక పలాయనంబును రుక్మియనువాని భంగంబును రుక్మిణీ కల్యాణంబును అను కథలుగల దశమస్కంధంబు నందుఁ బూర్వభాగము సమాప్తము.

టీ. శ్రీ=శుభప్రదుఁడైన, పరమేశ్వర = భగవంతుని, కరుణా = కృపచే, కలిత=పొందఁబడిన, కవితావిచిత్ర = కవిత్వముయొక్క విచిత్రము కలవాఁడును, కేసన మంత్రిపుత్ర =కేసనామాత్యుని సుతుండును, సహజ పాండిత్య=స్వభావముచేఁ గలిగిన పాండిత్యము గలవాఁడును, (అయిన) పోతనామాత్య ప్రణీతంబు = పోతనమంత్రిచేఁ జేయఁబడినది, ఐన, శ్రీమహా భాగవతంబు అను మహాపురాణమునందు, రుక్మిణీజననంబును = రుక్మిణి పుట్టుకయు, రుక్మిణీసందేశంబును = రుక్మిణి వృత్తాంతమును, వాసుదేవ+ఆగమనంబును = కృష్ణునివచ్చుటయు, రుక్మిణీ గ్రహణంబును = రుక్మిణి నెత్తుకొనిపోవుటయు, రాజలోక పలాయనంబును=రాజులెల్లరుం బాఱిపోవుటయు, రుక్మియనువాని భంగంబును, రుక్మిణి కల్యాణంబును, అను కథలు గల దశమస్కంధంబునందుఁ బూర్వభాగము సమాప్తము.

సంపూర్ణము.

---

Vemkatram Power Press, Ellore – 200[illegible].